# జానపద గేయాలలో పురాణాలు

[రామాయణ భారత భాగవతాది పౌరాణిక గేయాల సంకలనం]


డాక్టర్ రాసాని వెంకట్రామయ్య

ఆంధ్రోపన్యాసకులు

యస్. వి. జూనియర్ కాలేజి, తిరుపతి.



జనహిత పబ్లికేషన్స్

1-2-190 పోలీస్‌లైన్

యస్.ఐ. క్వార్టర్స్, ప్రకాశంరోడ్,

తిరుపతి-517 501.

జానపద గేయాలలో పురాణాలు

[రామాయణ భారత భాగవతాది పౌరాణిక గేయాల సంకలనం]

ప్రథమ ముద్రణ-1992.

వెల: రూ॥ *40-*

ప్రాప్తిస్థానం :

1. డా॥ కె. ఉమాదేవి, బి.హెచ్.యమ్ యస్.
జనహిత హోమియో క్లినిక్,
1-2-190, పోలీస్ యస్.ఐ. క్వార్టర్స్ లైన్,
ప్రకాశం రోడ్, తిరుపతి-517 501,

2. డా॥ వి.ఆర్. రాసాని,
తెలుగు లెక్చరర్
యస్.వి. జూనియర్ కాలేజి
తిరుపతి-517 502.

3. కె. మద్దయ్య,
తెలుగు లెక్చరర్,
10-75, కృష్ణానగర్. కర్నూలు-518002.

ముద్రణ
శారదా ప్రింటర్స్
132, ప్రకాశంరోడ్డు
తిరుపతి - 517 501

ఇది టి.టి.డి. వారి ఆర్థికసహాయంతో ముద్రింపబడినది



"THIS BOOK IS PUBLISHED
WITH THE FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATI DEVASTHANAMS UNDER
THEIR SCHEME AID TO PUBLISH RELIGIOUS BOOKS".

# అంజలి

నాకు సహజంగా జానపద సాహిత్యమన్నా, కళలన్నా చాలా ఇష్టం. అందుకే శ్రీ వెంకటేశ్వరా విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. చదివే రోజుల్లోనే ఐచ్ఛికాంశంగా నేను జానపద సాహిత్యాన్ని ఎన్నుకున్నాను. అప్పట్నుంచే జానపదగేయాల్ని సేకరించడం, పరిశీలించడం మొదలు పెట్టాను. దానికి మా గురువర్యులు కీ॥ శే॥. ఆచార్య జి. నాగయ్య గారు నాకెంతో ప్రోత్సాహమిచ్చారు. వెన్నుతట్టి అభినందించారు. ''చిత్తూరు జిల్లాలోని వేడుకపాటలు—ఒక పరిశీలన'' అన్ననా ఎం ఫిల్. లఘుసిద్ధాంత గ్రంథానికీ (1982-85), అట్లే రాయలసీమలోని వేడుకపాటలు — ఒక పరిశీలన'' (1986 - 91) అన్ననా పిహెచ్. డి. సిద్ధాంత గ్రంథానికీ పర్యవేక్షకులుగా వ్యవహరించి నాకూ నా సాహిత్య జీవితానికీ ఒక గమ్యాన్ని నిర్దేసించారు. అలాంటి మహామనీషి ఈనాడు లేరు. ఈ సందర్భంగా వారిని స్మరించుకోవడం నా కనీస ధర్మంగా భావించి అంజలి ఘటిస్తున్నాను.

అడిగిన వెంటనే కాదనకుండా ఎంతో ఆదరంగా అభినందన రాసిచ్చిన పూజ్యులు ఆచార్య బి. రామరాజుగారికీ, అలాగే ముందుమాట రాసి పంపించిన ఆచార్య ఎస్. గంగప్ప గారికీ .... ........ ....

సర్వదా నా అభివృద్ధిని కాంక్షించి, ఈ పుస్తకం అచ్చుకావడానికి ప్రోత్సహించిన మా మామగారు శ్రీ కె. మద్దయ్య, లెక్చరర్ కర్నూలు గారికీ కృతజ్ఞతలు.

నా సోమరితనాన్ని పోగొట్టి నా చేత ఈ పుస్తకం రాయించి అన్ని విధాలా సహకరించిన నా శ్రీమతి డా॥ కె. ఉమాదేవికీ ఆశీస్సులు.

పాటలు పాడి వినిపించిన జానపదులకు ....... ఆర్థిక సహాయాన్నందించిన టి. టి. డి. వారికీ.... సకాలంలో ముద్రించి ఇచ్చిన శారదా ప్రింటర్స్ వారికీ నా కృతజ్ఞతలు.

ఇట్లు

డా॥ రాసాని

# ముందుమాట

**ఆచార్య ఎస్. గంగప్ప**

**ఎమ్. ఏ., పి హెచ్. డి.**

**తెలుగు విభాగం**

నాగార్జున విశ్వ విద్యాలయం,

గుంటూరు.

జానపద సాహిత్యం, శిష్ట సాహిత్యం సమానాంతరంగా కొనసాగుతు సమాజంలో అందరినీ అలరిస్తూ వస్తున్న అంశం మనకు తెలిసిందే. శిష్ట సాహిత్యం పండితులకు పరిమితం. శిష్టేతర సాహిత్యమైన జానపద సాహిత్యం జానపదులకు సంబంధించింది. శిష్టసాహిత్యం లిఖితం. జానపద సాహిత్యం ఓరల్—మౌఖికం లిఖితమైన శిష్ట సాహిత్యంలో మార్పులకు, చేర్పులకు, కూర్పులకు అవకాశం లేదు. ఓరల్ సాహిత్యమైన ప్రజల సాహిత్యం తప్పని సరిగా మార్పులకు, చేర్పులకు, కూర్పులకు గురి అయి తీరుతుంది. ఈ జానపద సాహిత్యం గాలి లాగా ఒక చోటి నుంచీ మరో చోటికీ, ఒక నోటి నుంచీ మరో నోటికి వెళ్లి పోయి ఆయా ప్రాంతాల పరిసరాలకనుగుణంగాను, ఆయా ప్రజల అభిరుచులకు ప్రతీకల్లాగాను ఈ మార్పు, చేర్పు, కూర్పులకులోను కావడం అత్యంత సహజం! తదనుగుణంగా ఆయా ప్రజలకు నచ్చిన తాము మెచ్చిన, తమకు వచ్చిన భాషలో, పద్ధతిలో పాడుకుంటారు. ఈ మార్పులలో కొన్ని అంశాలు వదలి పెట్టబడవచ్చు. మరి కొన్నింటిని మార్చవచ్చు. కొత్తగా

కొన్ని అంశాలను ఏర్చి కూర్చవచ్చు. ఇలాగా మార్పులకు లోనై అక్కడ మళ్ళీ కొంగ్రొత్తగా పూర్తిగా కాకపోయినా స్వల్ప భేదాలతో మరో రీతిలో ప్రచారంలో ఉండవచ్చు. ఆంధ్ర దేశమంతటా — కొన్నింటిని మినహాయిస్తే చాలా జానపదగేయాలు వినిపిస్తూనే ఉంటాయి. అయితే పైన చెప్పినట్టు ఇవి చిన్న చిన్న మార్పులు చేర్పులకు లోనయి మాత్రముంటాయి. శ్రీకాకుళం జిల్లాలోని 'రామాయణ పాటలు' చిత్తూరుజిల్లాలోని రామాయణ గేయాలు సమంగా కనిపిస్తాయి. చిన్న భేదాలు మాత్రం సహజమే. నేనెప్పుడో సేకరించి ప్రకటించిన 'జానపద గేయ రామాయణం' లోని లంకానగర వైభవమని ఈ పుస్తకంలోని డా॥ రాసాని సేకరణ పాటలు ఒకే రీతిగా వున్నాయి. అంటే అందులో ఎక్కువ మార్పులు రాలేదు. మార్పులు వచ్చినవి అనేక మున్నాయి. ఏది ఏమైనా ఈ జానపద గేయ సాహిత్యం తెలుగు సంస్కృతి కాణాచి. దాన్ని సేకరించి ప్రకటించి ప్రచురించి భావితరాలకు అందివ్వవలసిన అవసరమెంతైనా ఉంది.

ఆ ప్రయత్నాన్ని మన డా॥ రాసాని ఈ 'జానపద గేయాలలో పురాణాలు' అనే పుస్తకం ద్వారా విశదం చేసు కొంటున్నాడు. ఇందులో రామాయణ, భారత, భాగవతాది పౌరాణిక గేయాలను సేకరించి వివరించి ప్రకటిస్తున్నాడు. ఇది శుభ సూచకం. మనం అందరం ఆహ్వానించ దగింది. రామాయణ గేయాలు 'శ్రీకృష్ణశ్రీ' దగ్గర నుంచి అనేకులు సంకలించి ప్రకటించారు. కానీ, భారత భాగవతాది గేయాలు అక్కడక్కడా సందర్భవశాత్తు చూడ గలిగామేగానీ ఇలా ఒకచోట దొరకవు. ఆపని డా॥ రాసాని చేసినందుకు అభినందిస్తున్నాను. ఇంతేగాదు. రామాయణ గేయాలు పూర్తి రామాయణ కథను తెలిపేవిగా ఉండగా తక్కినవి అంత పరిపూర్ణంగా లేవు. అంటే తదితరమైన కథల కంటే రామాయణకున్న ప్రజాదరణే దీనికి కారణం. ఆ ఆదరణతో పామర ప్రజలు సీతాదేవి కష్టాలకు స్పందించి చెప్పుకొన్న అనేకాంశాల ద్వారా ఆ పామరుల మనస్తత్వం వ్యక్తమవుతుంది.

డా॥ రాసాని జానపద వాఙ్మయంలో రామాయణానికంత ప్రాధాన్యం రావడానికి జానపద వాఙ్మయమా లేక రామాయణ కావ్యమా అనే విచికిత్స (పు–10)ను లేవదీశాడు. ఎప్పుడు కూడా జనశ్రుతిలోని - అంటే ఓరల్ ట్రెడిషన్‌లోని జానపద గేయాలనుంచీ శిష్ట సాహిత్యం పుట్టుకొస్తుంది. ఏ సాహిత్యానికైనా పునాది అన్నది జానపద సాహిత్యమే. వాల్మీకికి సోమనాథునకు సైతం అనేక రకాల పాటలే తన కావ్యానికాధారమని చెప్పాడన్న అంశం మనం స్మరించుకోవలసి ఉంది. కాబట్టి అవాల్మీకములనబడేవి జానపదుల లోని వాటిని వాల్మీకి వదలిపెట్టి ఉండాలి, లేదా తరువాతి కాలంలో గ్రంథస్థమై ఉండవచ్చు. ఉదాహరణకు రంగనాథ రామాయణ కాలానికి ప్రజల్లో ప్రముఖంగా ఉండేవి గ్రంథస్థమై ఉండడ మనేది విశ్వసనీయమైన అంశం.

ఏది ఏమైనా రామాయణ భారత భాగవతాది పౌరాణికాంశాల పాటలన్నింటినీ తన వివరణతో ఈవిధంగా గ్రంథ రూపంలో ప్రకటించడం మెచ్చదగ్గ అంశం. ఇందుకు రాసానిని అభినందిస్తున్నాను. ఆశీర్వదిస్తున్నాను. ఇంకా మరెన్నో మంచి రచనలతో తనదైన వ్యక్తిత్వాన్ని నిరూపించుకోగలగాలని ఆకాంక్షిస్తున్నాను.

ఈ పుస్తకంలో అచ్చుతప్పులు ఎక్కువగా దొర్లాయి. వాటిని ద్వితీయ ముద్రణలోనయినా సవరించగలడని ఆశిస్తున్నాను.

గుంటూరు

16–7–92.

ఆచార్య ఎస్. గంగప్ప

# అభినందన

**ఆచార్య బి. రామరాజు**
1-8-117/2 చీకటిపల్లి
హైదరాబాద్ - 500020

భారతీయత అంటే ముఖ్యంగా రామాయణ భారతాలు. ఇంకా భాగవతం పురాణాలు. ఆ రచనలు మన జాతి వైయక్తిక సామాజిక జీవితాలను అంత గాఢంగా ప్రభావితం చేసినాయి. వాటిని వ్యక్తులు రచించినారనటం కంటే మన జాతి సమష్టిగా స్పందించినతీరు అనటం ఉచితం. వాటి ప్రభావం నాగరకుల కంటే జానపదులపైన అందులోను మన సంస్కారధారా స్రోతస్వినులైన మహిళామ తల్లుల మీద అధికం. ఆ ప్రభావం ఫలితమే భారతదేశం భిన్న ప్రాంతీయ భాషా వాఙ్మయాలలోని జానపద సాహిత్యం. మన తెలుగులో కూడ రామాయణ భారత భాగవతాది పురాణాలకు సంబంధించిన జానపద సాహిత్యం ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క వైవిధ్యంతో ప్రచారంలో ఉన్నది.

చిరంజీవి డా॥ రాసాని వెంకట్రామయ్య రాయలసీమలోని రామాయణ భారత భాగవతాది పురాణాలకు సంబంధించిన తీరు తీరు పాటలు సేకరించి వాటి సహజ సౌందర్యం కాపాడుతూ గద్యవ్యాఖ్యలతో మనకు ఆమెతలు పెడుతున్నాడు ఈ పుస్తకంలో. ఆయా గేయాలలోని భాషా విశేషాలు, భావ సౌందర్యం, జానపదుల అమాయిక మనఃప్రవృత్తులకు అనుగుణమైన కల్పనలు ఆ పాటల్లో ప్రతిబింబించే మన సంస్కృతీ విశేషాలు స్థాలీపులాకంగా తెలిపినాడు. అతని కృషిలో ఉన్న నిజాయితీని అగ్గిస్తున్నాను. వర్ధమాన రచయిత డా॥ రాసాని వెంకట్రామయ్య ఇతోధికంగా సాహిత్యసమారాధనం చేయగలడని విశ్వసిస్తున్నాను.

హైదరాబాదు
1-8-82

బిరుదురాజు రామరాజు

# ఇందులో...

# ప్రవేశిక

మన వాఙ్మయమంతా ప్రభు సమ్మితం, మిత్ర సమ్మితం, కాంతా సమ్మితం అని ముత్తెరుగులుగా విస్తరించి వుంది.

అందులో వేద వాఙ్మయం ప్రభు సమ్మితం. మానవాళి సుఖ జీవనం కోసం చెప్పిన ధర్మాన్ని అవి ప్రభువులాగ శాసిస్తాయి. "సత్యం వద ధర్మంచర" అన్న పరమ ధర్మాన్ని వేదాలు శాసిస్తాయి.

పురాణ వాఙ్మయమంతా మిత్ర సమ్మితం. వేదాలలో చెప్పబడిన ధర్మాన్నే కఠినంగా గాక ఒక మిత్రుడిలాగా ప్రియంగా ప్రబోధించేవి పురాణాలు. ఈ ప్రబోధం కథా రూపంలో ఉండడం విశేషం. ఉదాహరణకు సత్యంవద అన్న ధర్మాన్నే తీసుకుంటే... అది వేదాల్లో వున్నదే... కానీ ఆ ధర్మాన్నే పురాణాలలో హరిశ్చంద్రుని కథ ద్వారా చెప్పి సత్యం యొక్క ఔన్నత్యాన్ని చాటి చెప్పడం జరిగింది.

ఇక కావ్యం కాంతా సమ్మితం అని చెప్పబడింది. భార్య వలె గుణా లంకారాదులతో మనోరంజనం కలిగిస్తుంది కావ్యం, పురాణోక్తమైన ధర్మమే వ్యంగ్యంగా కావ్యాల్లో చెప్పబడుతుంది.

పై మూడింటిలో పురాణాలే ప్రజల్ని ఎక్కువ ప్రభావితం చేసాయి, ఇవి అతి విస్తృతాలై నప్పటికీ వేద ధర్మాన్ని పవిత్రంగా ప్రబోధిస్తాయి.

అందుకు పురాణమంటే ఏమిటో తెలుసుకోవడం అప్రస్తుతం కాబోదు.

''అలౌకికములును అద్భుతములును అయిన భగవల్లీలా కథనములితో నిండినది'' పురాణమని విజ్ఞుల అభిప్రాయం.[1]

వేదాలలో పెద్దగా కనిపించని అవతారాల ప్రసక్తి భగవన్మహిమ, ఆరాధన పురాణాలలో ప్రధానంగా కనిపించే అంశాలు.

''పురా పూర్వస్మిన్ భూత మితి పురాణమ్'' అని పురాణాన్ని అమర కోశం నిర్వచిస్తుంది.

ప్రాక్తన విషయాలను తనయందు గర్భీకరించుకున్నది పురాణమని అర్థం.

ఈ పురాణాన్ని గురించి పురాతన కథ 'పూర్వ కథ' అను అర్థాలు అథర్వణ వేదంలో చెప్పబడ్డాయి.

శతపథ బ్రాహ్మణంలోను ఉపనిషత్తుల్లోను పురాణాలు అంటే ప్రాచీన కథల్ని వర్ణించే గ్రంథాలు అని చెప్పబడింది.

''పురానవభతి పురాణమ్'' అని యాస్కుడు తన వేదాంగమైన నిరుక్తంలో సెలవిచ్చాడు.

అంటే పురాతన విషయాభిరతి కలిగి వుండేది పురాణమని అర్థం.

ఇదే అంశాన్ని 'పురానీయతే ఇతి పురాణమ్' పురా విషయాల్లో ఒదికి వుండేది అని వాచస్పత్యంలోను, 'పురా నక్తి 'పురాతన వస్తు కల్పికం అని బ్రహ్మాండ పురాణంలోను చెప్పడం జరిగింది.

ప్రాచీన మైన దయినప్పటికీ నూతనత్వాన్ని పొంది వుండేది (పురా పినవమ్ పురాణం) అని భవిష్య పురాణంలో పేర్కొనబడింది.

నిజానికి వేదతత్త్వాన్ని విప్పి చెప్పినవే పురాణాలు, అత్యున్నతమైన

హిందూ సంస్కృతి అనబడే కల్ప వృక్షానికి వేర్లు వేదాలు; కొమ్మలు స్మృతులు పత్రపుష్పాలు పురాణాలు, మధురఫలాలు ఇతి హాసాలని దేవీభాగవతకారుని అభిప్రాయం దేవీ భాగవతంలోనే (XI 1-21) పరమేష్టికి శ్రుతిస్మృతులు కనుద్వయమనీ, హృదయం పురాణమనీ చెప్పడం జరిగింది.

భారతీయ వాఙ్మయంలో రామాయణం భారతం, భాగవతాలతో బాటు వ్యాసుని అష్టాదశ పురాణలు, మరిన్ని ఉపపురాణాలు వున్నాయి,

ఈ పురాణాలు భారతీయ సంస్కృతిలో ఒక భాగంగా కలిసిపోయాయి. అందుకే పురాణాలను మన సంస్కృతి నుంచీ వేరుగా చూడలేం,

ఈ వురాణాలు అటు శిష్టుల్ని, ఇటు పామరుల్ని ఒకే విధంగా ప్రభావితం చేసాయి. తదను గుణంగానే పురాణ సాహిత్యమూ వెలువడింది.

## శిష్టసాహిత్యంలో పురాణం :-

ఆంధ్రులకు పురాణ ప్రీతి ఎక్కువనే చెప్పవచ్చు. పురాణ పఠనం వల్లా పారలౌకిక పరమార్థం లభిస్తుందని విశ్వసిస్తారు.

తెలుగులో ఎంతో పురాణ సాహిత్యం వెలువడింది పాల్కురికి సోమ నాధుడు, మారన బమ్మెర పోతన ఆంధ్ర పురాణ సాహిత్యమున కవిత్రయము వంటి వారు "[2] అని, జి.వి. సుబ్రహ్మణ్యంగారి అభిప్రాయం.

పాల్కురికి సోమనాధుడు రాసిన బసవ పురాణమే తెలుగులో మొదటి పురాణం. వీరశైవమత ప్రబోధానికి గాన యోగ్యమైన ద్విపద నుపయోగించి బసవ పురాణం రాయబడింది.

ఆ తర్వాత మారన మార్కండేయ పురాణం రెండవది. బసవ పురాణం తెలుగులో మొదట వెలువడిన పురాణమైనప్పటికీ జి.వి. సుబ్రహ్మణ్యం లాంటి వారు మార్కండేయ పురాణాన్నే ప్రథమాంధ్ర మహాపురాణంగా పేర్కొన్నారు[3]

మారన మార్గాన్ని ననుసరించి తెలుగులో వెన్నెలకంటి సూరన విష్ణు పురాణం, నందిమల్లయ ఘంటసింగనల వరాహపురాణం వెలువడ్డాయి.

అయితే పురాణాలకు కావ్యత్వస్పృహను కలిగించింది కవిత్రయం వారే.

ఎఱ్ఱన రాసిన నృసింహ పురాణం కూడా ఈ కోవకే చెందుతుంది. అలాగే ఎఱ్ఱన హరి వంశం, శ్రీనాథుని భీమేశ్వర పురాణాదులు పురాణ ఖండానువాద వైఖరికి నిదర్శనాలు.

ఈ మార్గంలోనే అనేక మంది తెలుగు కవులు సంస్కృత పురాణాలను అద్భుతమైన కావ్యాలుగా మలిచారు. అలాగే ఎన్నో క్షేత్ర పురాణాలు కూడా పుట్టుకొచ్చాయి.

## జానపదుల పైన పురాణ ప్రభావం :-

పురాణాలు శిష్టుల్ని ప్రభావితం చేసినట్లే జానపదుల్ని ప్రభావితం చేశాయి. ముఖ్యంగా రామాయణ, భారత, భాగవతాలు జానపదుల జన జీవన ప్రవంతిలో కలసి పోయాయి.

పురాణాలలో కనిపించే రాముడు, సీత, దశరథుడు, రావణుడు, పాండవులు కౌరవులు వంటి అనేక పాత్రల్ని సమాజంలో వెతుక్కుంటారు జానపదులు.

వీడు ధర్మరాజురా నాయనా. వీడు సత్య హరిశ్చంద్రుడి పక్కింటివాడు, వీడు అపరశకునిరా, వీడు పుల్లలకారి నారదుడురా వంటి వ్యవహారిక వాక్యాలే అందుకు నిదర్శనం. అంతేగాకుండా నిద్రకుపక్రమించినా నిద్ర మేల్కొన్నా రామా కృష్ణా శంకరా గోవిందా వంటి మాటల్నిఉచ్చరించని జానపదుడుండడంటే అతిశయోక్తి కాదు. వారి జీవితాల్లోకి పురాణాలు అంతగా చొచ్చుకుపోయాయి మరి.

అందుకే వారి మాటల్లో పాటల్లో ఆటల్లో సైతం పురాణం దర్శనమిస్తూనే వుంటుంది.

## జానపద సాహిత్యంలో పురాణం :

జానపద సాహిత్యంలో పురాణ సాహిత్యం ఎంతో వుంది. పౌరాణిక కథలు, పాటలు ఇంకా నాటకాలు, బుర్రకథలు, హరికథలు, తోలుబొమ్మలు వంటి కళారూపాలు పురాణ సాహిత్యాన్ని విక్షిప్తం చేసుకొని వున్నాయి.

సంపూర్ణ రామాయణం, శ్రీరామ పట్టాభిషేకం హనుమాన విజయం, మైరావణ, లవకుశ, రామాంజనేయ యుద్ధం వంటి రామాయణ సంబంధాలు, ద్రౌపదీ వస్త్రాపహరణం, పాండవ వనవాసం, పాతాళావతం, విరాటపర్వం, కృష్ణరాయబారం, ఉత్తరగోగ్రహణం, శశిరేఖాపరిణయం వంటి భారతసంబంధాలు శ్రీకృష్ణలీలలు, కంసవధ, రుక్మిణీ కల్యాణం, భక్తప్రహ్లాద వంటి భాగవత సంబంధాలు, భూకైలాస్, మహిషాసురవధ వంటి శైవశక్తి సంబంధాలు అన్నీ ఈ కోవకు చెందినవే. ఇవన్నీ వచన, గేయ. సాహిత్యాల్లోనే గాక అనేక కళా రూపాల్లోను ప్రదర్శింపబడుతుంటాయి.

## జానపద గేయాలలో పురాణం :

అనేక పురాణ సంబంధమైన ఘట్టాల్ని పాటలుగా కట్టి గానం చేసుకున్నారు జానపదులు. ఈ జానపద గేయాలలో పురాణాలు ముక్తాలుగానే కనిపిస్తాయి. అంతేగానీ పూర్తి పురాణం కనిపించదు. అలాంటి అతి విస్తృతి జానపద గేయాలకు సరిపడని అంశం. కాబట్టి పురాణంలోని ఒక్కో ఘట్టం ఒక్కోపాటలో గానీ, కొన్ని పాటల్లో గానీ చూడవచ్చు.

జానపద గేయాలలో పురాణసాహిత్యం ముఖ్యంగా రామాయణ, భారత భాగవత పరంగానే ఎక్కువగా కనిపిస్తుంది. కొన్ని ఇతర పురాణాంశాలు కూడా కనిపిస్తాయి. ఈ దృష్టికోణం నుంచీ మొత్తం పురాణ సాహిత్యాన్ని ఈ క్రింది విభాగాలుగా విభజించి పరిశీలించ వచ్చును.

1) జానపద గేయాలలో రామాయణం.
2) జానపద గేయాలలో భారతం
3) జానపద గేయాలలో భాగవతం.
4) ఇతరాలు.

## జానపద గేయాలలో రామాయణం :

జానపద గేయాలలో రామాయణం ఏవిధంగా వ్యా
పరిశీలించే ముందు రామాయణం గురించీ, దాని పుట్టుక గురించీ
కూడా అవసరమే.

## రామాయణం గురించి కాస్తా...

రామాయణాన్ని మొదట వాల్మీకి రాసినప్పటికీ రామకథ
ప్రచారంలో వున్నట్టు భావించబడుతోంది,

భారతీయులకు పరమ పవిత్రమైంది రామకథ.

ఒక ఆదర్శనాయకుడు, ఒక పరిపూర్ణమైన ఉత్తమ మ
ఉండాలో రామాయణ కథ చెబుతుంది.

ఆ రామకథను పాడుకునే పామరగాయకులు భారత
ప్రదేశమంటు వుండదు.

అందుకే అనంతమైన రామాయణకథా సాగరాన్ని మధించి
అవసమైన అమృతగుళికల్ని మాత్రమే వాల్మీకి గ్రహించి వుంటా
ఆయా పాత్రల ఔన్నత్యానికి భంగం వాటిల్లని విధంగా మార్పుల
మరికొన్నింటిని పరిగ్రహించి వుంటాడు

రామకథా ప్రవంతికి అడ్డుతగలని అంశాలను తన కవితాశక్తితో కల్పనలు చేసి దానికి భక్తియనే కొనలు సారించి రసమయ మనోహరంగా రామకథను మలచివుంటాడు.

అవాల్మీకమైన రామాయణ ఘట్టాలు ఎన్నో జానపద గేయాలలో దొరక డానికి కారణం అదే అయివుండవచ్చు.

అలా వాల్మీకి తన కిష్టం లేక వదిలేసిన అంశాలు గేయాల రూపంలో ఒక తరం నుంచీ మరో తరానికి అనూచానంగా అందివ్వబడుతూ వచ్చాయి. ఇప్పటికీ అవి సజీవంగానే వున్నాయి. ఇందులో కొన్ని వాల్మీకి దృష్టికి రాకుండా కూడా వుండవచ్చు.

ఏది ఏమైనప్పటికీ రామకథ ఇంత ప్రచారంలోకి రావడానికి మాత్రం వాల్మీకే ముఖ్య కారణమని మాత్రం చెప్పక తప్పదు.

రామాయణ కావ్య నిర్మాణంలో ఆతని అంకుఠిత దీక్ష, పట్టుదల, కల్పనా చాతుర్యం, కవితాశక్తి, వర్ణనా పటిమ ఆ కావ్యాన్ని అజరామరం చేశాయి.

జానపదగేయ రామాయణం సంగతి ఎలావున్నా వాల్మీకిని రామాయణ రచనకు పురికొల్పిన పరిస్థితులు వేరు. నిజానికి ఏ సాహిత్యమైనా మొదట శోకం నుంచే పుట్టిందన్న సిద్ధాంతంలో చాలా వాస్తవముంది. దానికి కారణం ఏ దేశ సాహిత్యం చూసినా చాలా మటుకు మొదట శోకం నుంచే పుట్టినట్లు చెప్పే దాఖలాలు చాలావున్నాయి.

అలాగే రామాయణ కావ్య నిర్మాణానికి శోకమే ఉపకరణంగా భాసిల్లిందని చెప్పవచ్చు.

కావ్యారంభంలో వాల్మీకి శోక తప్త హృదయం నుంచీ ఒక శ్లోక ముదయించి, అదే ఆ కావ్య నిర్మాణ హేతువై భాసిల్లిన ఉదంతం కవి యొక్క సున్నిత హృదయతత్త్వానికీ అపారమైన కవితాశక్తికీ నిదర్శనంగా నిలుస్తుంది.

ఒకనాడు త్రికాలవేది అయిన నారదుడు వాల్మీకి ఆశ్రమానికి విచ్చేశాడు ఆతనికి సేవలు చేసి ప్రసన్నుణ్ణి చేసుకొన్న వాల్మీకి ఉత్తమ గుణాలు కలిగిన నరుని గురించి చెప్పమంటాడు.

వాల్మీకి అడిగిన ఉత్తమ గుణగణాలు దశరథుని కుమారుడయిన శ్రీరామ చంద్రునిలో వున్నాయని పేర్కొని, రామకథను సంగ్రహంగా వివరించి వెళ్ళిపోతాడు నారదుడు.

ఆ తర్వాత వాల్మీకి తమసీ నదీ తీరానికి వెళ్ళి ఆ నదీతీర ప్రాంతపు వన సౌందర్యానికి ముగ్ధుడవుతాడు. సన్మనుష్య సహృదయంలాగుందని ఆ వనాన్ని వే నోళ్ళ మెచ్చుకొని విపుల వనం వైపు దృష్టి సారిస్తాడు.

అక్కడ ఒక చెట్టుకొమ్మన జతకూడివున్న క్రౌంచ మిధునం అతని కంట పడింది. ఆ జంట ఆతని హృదయంలో నిండివున్న రామాయణకథలోని సీతా రాములుగా అనిపించింది కాబోలు తదేకంగా వాటినే చూస్తూ నిలబడ్డాడు. ఇంతలో ఒక నిషాదుడు ఆ జంటను బాణంతో కొట్టాడు ఆ దెబ్బకు అందులో మగపక్షి నేలకొరిగి కారుతున్న రక్తంలో విల విల తన్నుకోసాగింది.

ఆ హృదయ విదారక దుర్ఘటనకు ఆడపక్షి రోధిస్తూ దాని చుట్టు పరిభ్రమిసూ అల్లాడి పోతోంది

ఆ దృశ్యాన్ని చూసిన వాల్మీకి హృదయం శోక తప్తమైంది వేటకాని పైన పరాట్టని కోపం వచ్చింది ఆ శోకావేశంలో ఆతని నోటినుంచి అప్రయత్నంగా ఒక శ్లోకం వెలువడింది

''మానిషాద ప్రతి ష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచమిధు నాదేకమవధీః కామమోహితమ్,,

"ఓరీ నిషాదుడా! కామ మోహితమైవున్న మా జంటలో ఒకదాన్ని సంహరించితివి కదా! నీవు చిరకాలం జీవించవు." అని క్రౌంచీ మనోగత భావంలో తాదాత్మ్యం చెందిన వాల్మీకి హృదయం పలికింది.

ఆ శాపాక్షరాలే పాదబద్ధమై, శ్లోక బద్ధమై అక్షర సమన్వితాలై కరుణ రసభరితమైన రామాయణ మహా కావ్యానికి మూలభీజాలై నిలచాయి.

దానికి తోడు ఆ విషయం విన్న బ్రహ్మదేవుడు "వృత్తం కథయ వీరస్య యధాతే నారదాచ్ఛ్రుతమ్" అని వాల్మీకికి రామకథను రాయమని ఆనతిచ్చాడు.

ఇంకేం? రామాయణ కావ్యం సిద్ధమైపోయింది. దాన్ని ఆ బ్రహ్మదేవుడే ఈ లోకంలో చిరంజీవిగా నిలచిపోగలదని ఆశీర్వదించాడు.

> "యావతే స్థాస్యంతి గిరయః సరితశ్చమహీతలే
> తావద్రామాయణ కథాలోకేషు ప్రచరిష్యతి"

నిజమే ఆ బ్రహ్మవాక్కు రామాయణ కావ్య మహిమను కవి యశస్సును బ్రహ్మాండమంత చేసింది

తెలుగు నేలలోనే గాక యావత్భారతావని నాలుగు చెరగుల రామాయణం ప్రచారంలో వుంది. ఆ మాటకొస్తే ప్రపంచమంతటా రామకథ కాస్తో కూస్తో ప్రచారంలో వుందనడం అతిశయోక్తి కాదు.

రామాయణం అంతగా ప్రచారంకావడానికి వాల్మీకి కవితామాధుర్యమూ రామకథలో వున్న ఔన్నత్యమూ అని చెప్పక తప్పదు.

వాల్మీకి మధురాక్షరాలతో మధురాతి మధురంగా రామకథను మలిచాడు. అతని కవిత్వం కోకిల గానం కన్నా మిన్న.

> "కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్
> ఆరుహ్య కవితా శాఖాంవందే వాల్మీకి కోకిలమ్."

అని ప్రచారమైంది అందుకేనేమో!

ప్రౌఢ సాహిత్యంలో పరిఢ విల్లిన రామకథ జానప
సోయగాలు తొడుక్కుంది. నిజానికి జానపదవాఙ్మయాన్నుంచీ ర
ఆవిర్భవించిందో లేదా రామాయణ కావ్య ప్రభావంతో జానప
పుట్టిందో తెలియదు.

కానీ జానపద వాఙ్మయ వికాసానికి మాత్రం రామాయణ
చిందనడం మాత్రం నిజం. అందుకే కుమారి పంఢా శమంతక
వాఙ్మయమున రామవృథకు ప్రాధాన్యము కలదనుట కంటెను
వికాసమునకు రామకథ దోహదకారియైనదనుట సమంజసము''[4]

జానపద గేయాలలో రామాయణ కథ రక రకాలుగా :
జానపదులకు రాముడన్నా, రామాయణమన్నా అపారమైన భక్తి
రామనామ ప్రాశస్త్యాన్ని వేనోళ్ళ కీర్తించారు. ''రామనామము
రమ్యమైనదిది రామనామము'' అని శిష్టులు రామనామాన్ని కీర్తిస్తే
రామనామ మహిమను జానపదులు కీర్తించారు.

దశరథ నామమూ బహు సుంగారమూ
విన్నవారికీ పున్నెమూ....
కాశిలో బుట్టెరా ఈ నామమూ
కాశి గంగలో వెలిసెరా ఈ నామమూ
ఇంటిలో బుట్టెరా ఈ నామమూ
ఈపున వెలిగెరా ఈ నామమూ
గెనిములో పుట్టెరా ఈ నామమూ
బహు గనముగా వెలిగెరా ఈ నామమూ

ఈ రామాయణ పాటల్ని మొదట సేకరించిన వారు నంది
ఆ తర్వాత ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు కృష్ణ శ్రీగారి ఆ
రామాయణపు పాటలు'' ముద్రించారు[5].

ఆ తర్వాత నేదునూరి గంగాధరంగారు ప్రత్యేకంగా రామాయణపు పాటల్ని చెప్పక పోయినా కొన్ని రామాయణపు పాటల్ని గురించి చెప్పారు[6].

ఆ తర్వాత రామాయణ పాటల్ని సందర్భాను సారంగా అనేక మంది చెప్పారు. బి. రామరాజు, తుమాటి దోణప్ప, యస్. గంగప్ప, శమంతక మణి, జి. యస్. మోహన్ మొదలయిన వారు తమతమ గ్రంథాల్లో సందర్భాను సారంగా చక్కగా చెప్పారు.

నేను సేకరించిన రామాయణ సంబంధ గేయాలను ఆధారంగా చేసుకుని జానపద గేయాలలో రామాయణం ఎలా చిత్రీకరింప బడిందో ఈ క్రింది విధంగా చెప్పడం జరిగింది.

## శ్రీరామలాలి :

ప్రతి తెలుగు తల్లీ తమ బిడ్డలో రాముణ్ణి, కృష్ణున్ని లేదా సీతను చూసు కోవడం సహజం. తన బిడ్డతో ఒక ఆట ఆడినా ఒక పాటపాడినా ఆ తల్లికి రాముడే కనిపిస్తాడు.

అందుకే "రామాలాలీ మేఘశ్యామాలాలీ" అనీ "జోఅచ్యుతానందా జోజో ముకుందా-రారా పరమానంద రామ గోవిందా" అని పాడుకొనని తెలుగు తల్లులుండరు.

తన బిడ్డను ఏ తల్లి ఊయల లూపినా అది అలనాటి కౌసల్య రాముడికి ఊపిన ఊయలే. ఈ విషయంలో ప్రతి తల్లీ కౌసల్యే, ప్రతి బిడ రాముడే. అలనాడు రాముడూగిన ఊయలే ఈనాటి బాలుడూ ఊగుతాడు. ఆనాడు కౌసల్య ఊయల పాట పాడిందో లేదో గానీ ఈనాడు ప్రతి తెలుగుతల్లీ తన చిన్న రాముడికి ఊయల పాట తప్పకుండా పాడుతుంది.

''రామాలాలీ మేఘశ్యామలాలీ తామరస నయన దశరథ నయనా లాలీ ॥రామా॥
శ్రీరామ లోక నాయకా శేషాశయన -నారాయణాచ్యుతా ననుగన్నతండ్రీ ॥రామా॥
చిన్ని నవ్వుల నాయన చిన్ని నాయన్న రారా-నీకు పాలు యిచ్చేను - వెన్నెపాలు
నెయ్యి ఉగ్గు బాలుడా
నీవుతిన్నగా వచ్చి సేవించవయ్యా - తియ్యంగానుండు ॥ రామ ॥
సంపంగ నూనె తలంటి పోసేను - సామీనీకు యింపు తోడుగా కురుల దువ్వి
కర్పూర దూపమునేసేను - నిదరా పొమ్మా ॥ రామా ॥
అందాలతొట్టిలో నీవు నద్దుసేయక నిద్దర పోరా పక్కనే సౌమిత్రి వుండేను॥రామా॥

## సీతారాముల కళ్యాణం :-

గొల్లసుద్దులు ''పెండ్లి గోవిందనామములు'' వంటివి చదువు తుంటారు. వీరు గాయక భిక్షకులు, వీరు యాదవులలో ఒక తెగగా కూడా చెప్పుకుంటారు. వీరు యాదవ కులాలయిన గొల్ల, కురబ కులస్థులను మాత్రమే యాచిస్తుంటారు.

వీరు పాడే ఒక పెండ్లి గోవింద నామములో సీతారాముల జననం మొదలు వారి వివాహం వరకు వర్ణింపబడింది. అంతేగాక ఊర్మిళ, శృతకీర్తి, మాళవిల కళ్యాణాలు, లక్ష్మణ భరత శత్రుఘ్నులు వారిని చేపట్టే శుభ ఘడియ అంతా ఎంతో హృద్యంగా వర్ణింపబడింది.

''క్షీరసాగర మందు గోవింద రామా, శ్రీహరుదయించిరి
పాల సాగరమందు లక్ష్మీసమేతులైరి, ముక్కోటి దేవతల్ నీకు
మొక్కులు పెట్టిరి.
ఆలించి విన్న హరి వార్కి, అభయమునిస్తురట
సంతాన హీనులయి దశరథుడు తపము జేసెను
పుత్రకామేష్టిచే పాయసం వండిరి, పాయస పాత్రలు పణతులు
పొలుచు కన్నులు తెలుచు ముఖములు గర్భపు చిహ్నలు కనబడతోచె

ఆరు మాసాలాయె ఆ దేవి గర్భములు తొమ్మిది మాసములాయె
తోయజాక్షులకెల్ల పది మాసములాయె బాలురుదయించిరి
కౌశల్య గర్భాన రాముడుదయించెను.
కైకమ్మ గర్భాన భరతుడు ఉదయించెను
సుమిత్ర గర్భాన సుతులు యిద్దరుగా
దశరథుని గర్భాన నలుగురవతార మయిరి
పుత్రులు పుట్టిరట పుణ్యవేళ చూసిరి పుత్రోత్సవము బెట్టిరి.
భూమి జనులకెల్ల సర్వరాత్రులు గడిచి పురుడువేడుకలాయె
పట్టముల వారలకు పసుపు నూనెలు పోస్త్రిరి
సంపెగ తైలాల సుతులకు శిరమంటిరి
పసుపుతో పదిలాన పణతులు బెట్టిరి
వెండియ్య గాబులు వేడినీళ్ళు తోడిరి
పయిడయ్య గాబుల చన్నీళ్ళు తోడిరి
చన్నీళ్ళు వెన్నీళ్ళు సమముగా దోడిరి
ముత్యాల చెంబుల ముదితలందించిరి పూరాణ కుమాళ్ళ
మజ్జన మాడిరి మెత్తని వస్త్రాల మేనులొత్తిరి
పట్టు వస్త్రాల తెచ్చి బాలురకు పొత్తిళ్ళు పరచిరి
కాటుక చుక్కబొట్టు పసిబాలలకు బెట్టిరి
పుల్లిదేరా తులసి బాలురకు పొగవేసిరి పుల్లీ వేసినూనె
పణతుల గోళ్ళు బోసిరి సంపెంగ తైలాన సతుల శిరమంటిరి
పసుపులో పదిలమగు పణతుల బెట్టిరి వెండియ్యగాబుల
వెన్నీళ్ళు బోసిరి పయిడయ్య గాబుల చన్నీరు డితోరి
చన్నీరు వెన్నీళ్ళు సమముకా తోడిరి॥.
ముత్యాలచెంబులతో ముదితలందించిరి పలుమారు భార్యలు మజ్జమాడిరి
మెత్తని వస్త్రాలు మేనత్తలొత్తి పట్టుచీరా తెచ్చి
పణతులకు గట్టిరి పాదముల నందెలు పాయట పత్రములు

ముత్యాల పణతులు ముదితలందించిరి
వజ్రాల వడ్డాణం పణతులకు పెట్టిరి
కనగ పూవు రవికెలు – చీరలు తొడగిరి
చామపు కడియాలు – చీరలు పెట్టిరి
అంత శృంగారము – అ పణతులకు జేసిరి
నిలువుటద్దము దెచ్చి – వెలుతురు చూపిస్త్రిరి
పురుడు గలిగిన వెనుక పుణ్యాహానం జేసిరి – బారసాలచేసిరి
భూపతేశ్వరులకు – పయిడి పళ్లెము తెచ్చిరి
పాలునిండా బోసిరి – నామకరణము వ్రాసిరి
రామ లక్ష్మణులని – భరత శతృఘ్నులని నలుగురికి నామము లిడిరి.
ఒక మాసమున – బత్తిగిల నేర్చిరి
రెండో మాసము – కూర్మము సలిపిరి
మూడో మాసమున – పెదవులు విరచిరి
నాలుగో మాసమున – నవ్వులు నేర్చిరి
అయిదో మాసమున ఆటలు నేర్చిరి.
వరుస వజ్రాంగుల – వరుసతో వచ్చిరి,,

ఇలా సాగే ఈ సుదీర్ఘ గేయంలో దశరథ పుత్రుల శైశవ క్రీడలు, కౌశిక యాగం కాచి రావడం, సీతారాములతో బాటు లక్ష్మణ భరత శతృఘ్నులకు వరుసగా ఊర్మిళ, శృతకీర్తి, మాళవిలను ఇచ్చి జనకుడు పెళ్ళి చేయడం వంటి అంశాలు గానం చేయబడుతాయి

ఆ వివాహ మహోత్సవం ఇలా జరుగుతుంది.

"రాఘవులు గట్టేటి ఆ దుస్తులిచ్చిరి
కట్నాలు అందుకొని కౌశికులు మెచ్చెను
అతి సంభ్రమము చేత ఆదిలక్ష్మి కొచ్చెను

ఢంకా ఢమారాలు దశరధులు పుచ్చుకొవిరి
అరు కోట్ల శ్వాలు అలంకారమై వచ్చెను
పట్టపుఏనుగు నెక్కి పట్టుబల్ల పరచిరి
పట్టు బల్లం బరచీపవిడగవి పెనవేసిరి
కూర్చున్న బాలలకు గుబ్బ గొడుగు పట్టిరి
కౌసల్య తనయులకు కాగితపు గొడుగు బట్టె
పసిబిడ్డ బాలాది పట్నమంతా జల్లిరి
మైథిలీ నగరాన విడిదిళ్ళు దిగి ఉండిరి
నిండు సంభ్రమము చేసి కోటికి పడగెత్తి
ఒప్పుతో కౌశల్య నగలందమెచ్చెను.
కళ్ళు కాటుకలుంచె కౌశల్య తలయులకు దిష్టి తగులాకుండ
చెక్కిట చుక్కుంచె కన్యాలలామను
గంపలోకి మడను కాళ్ళు దిగువ నుంచి గంపలో గూర్చుండె
గోవిందా రామా॥.[8]

ఇలా జరిగిన ఈ పెళ్ళి సందర్భంలో వధూవరులకు అరుంధతిని చూపడం, ఆ తర్వాత జనకుడిని కట్నకానుకలు అడగడం హృద్యంగ సాగుతుంది.

''ధనములియ్యము మేము ముట్టనియ్యం మేము
ఇంత ధనము లేదు యెంతయినా ఇమ్మనెను
అంగళ్ళవారిలో అని తలపోయె - ధనములిప్పించితి
సంతస మందిక నీవు - ధనము పెట్టె తెచ్చిరి - బాలుని ముందు పెట్టిరి''.

ఆ తర్వాత జనకుడు కూతుళ్ళను అత్తవారింటికి పంపుతూ....
నా కడుపునా మీరు నలుగురు పుట్టితిరి
పణతి శాంతాతోను - అయిదుగురమనుకొండి
పణతి శాంతా వద్ద భయభక్తి వుండండి''.

అని జాగ్రత్తలు చెప్పి రత్నారాసులిచ్చి పంపించడంతో గేయం ముగుస్తుంది.

## సీత సమర్త :

ఆంధ్రుల ఆడబిడ్డ మొట్ట మొదట రజస్వల అయితే పెద్ద మనిషి అయింది సమర్తాడిందంటారు. అలా సమర్తాడగానే ఓ మూల పచ్చని టెంకాయ మట్టలతో గుడిసె వేసి దాన్ని నేరేడు మండలతో కప్పి ఆమెనందులో ఉంచుతారు.

అలా గుడిసెలో అయిదు రోజులుగానీ, తొమ్మిది రోజులు గానీ వున్న పిదప... ఆమెకు అభ్యంగన స్నానం చేయించి యింటిలోకి చేర్చుకుంటారు.

ఆ రోజు రాత్రి ఆమెను ఒక కుర్చీలో కూర్చోబెట్టి కొత్త బట్టలు కట్టి నగలు వేసి నలుగులు పెడతారు. ఆ సమయంలో పాడవే సమర్త పాటలు లేద రజస్వల నలుగు పాటలు. ఈ పాటల్లో సమర్తాడి సంసారానికి సమర్థురాలనిపించుకొన్న ఆడపడచు సీతగా భావించబడుతుంది. ప్రతి ఆడపిల్ల తండ్రీ ఒక జనకుడిగానే వారికి కనిపిస్తాడు.

ఒక సమర్తపాటలో ఆమె బంధువులలో ఎవరెవరు సమర్త నలుగు తెస్తారో రమణీయంగా చెప్పబడింది.

"రారా పాండారి రంగా రాజా....
కుందనపు పూటముల కూచ్చుందువు రావయ్యా
అగరపాకులే చిగర పొక్కలే
అణె ముత్తేమే అమరిన సున్నము ॥ రారా ॥
జనకు జనకూ నింట జనకూనింట
సత్య జనకూ నింటా జనిమించే సీతా
జనమించారో సీతా జగము రచ్చించా
పుట్టతా సీతా బుద్దులడిగ నేర్చా

నవుతా సీతా నలుగూనే గోరే

తల్లి బుద్ధి అడగ నేర్చా
తల్లి సొమ్ములన్నీ బెట్టా నేర్చేనూ
తల్లికి తగవులూ (బుద్ధులు) చెప్పా నేర్చేనూ
ముక్కు మీద మొటమో అదేమి మొలెమో సీతా....
సద్దెన్ను సరిబాలు సమర్తాల మొలెమ....
దశరధుడు బంపేను ధైర్యముతో నలుగు
కవి సెల్లో పంపేను కదవలతో నలుగు''.

## శ్రీరామ వనవాసం :

రాముడు వనవాసం వెళ్ళడానికి కైకేయి కారణమైన కథ అందరికీ తెలిసిన విషయమే.... అయితే కైక రామున్ని మాత్రమేఅడవికి వెళ్ళేటట్లు దశరధుని వరం కోరుకున్నది గానీ సీతా లక్ష్మణుల్ని కూడా వనవాసం చేయమని కోరలేదు.

కానీ సీత మహా సాధ్వి, పతి అడుగుజాడల్లో నడవడమే కర్తవ్యంగా భావించి భర్తతో బయలుదేరింది. మరి లక్ష్మణుడు? ...లక్ష్మణున్ని అడవికి వెళ్ళమని ఎవ్వరూ కోరలేదే....మరి ఎందుకు వెళ్ళినట్టు?

దానికి సరైన సమాధానం.... వాల్మీకి రామాయణంలో దొరకదు. జానపదుల రామాయణంలో దొరుకుతుంది.

లక్ష్మణుడికి అన్నంటే. అపారమైన భక్తి, అనురాగం. వదిన సీతమ్మంటే ఎనలేని అభిమానం. అన్నా వదినల్లో తన తల్లి దండ్రుల్ని దర్శించాడు లక్ష్మణుడు. అందుకే వారి వెంట వెళ్ళాడు.

మొదట రాముడు పయనమయ్యాడు. భర్తతోడిదే లోకంగా భావించిన పరమ పావని సీత భర్తను అనుసరించింది. ఆ తర్వాత కౌసల్య కూడా వనవాసం

బయలు దేరుతుంది. ఆమెను అనునయించి వెనక్కి పంపిస్తాడు రాముడు. ఆ తరువాత వీధిలో బొంగరాలాడుతున్న లక్ష్మణుడు అన్నను చూసి వచ్చి తానూ అడవికి పయనమౌతాడు.

ఆ సమయంలో రాముడు వారిని నివారించిన విధం లక్ష్మణుడు అన్నా వదినల్ని అనుసరించిన విధం అంతా జానపదుల హృదయ స్పందన కనుగుణంగా మలచబడ్డది, ఇది మడినాట్లు వేసేటప్పుడు ఆడవాళ్ళు ఆనందంగా పాడుకునేపాట

"సూరీడు చంద్రుడు – కోరియాగము తలపగా....
అమ్మ బతుకులు – అడవిలో తపుసులూ
వారాము కోరినాడే ఓ రామా-వల్లానన్న బొమ్మ వలసి రామస్వామి
తల్లి ముందర బోసెనూ – ఓరామా నీవు పోతేను కొడుకా నాకేమి పనులానీ
తల్లి పయనమవును ఓరామా వద్దొద్దు ఓతల్లి బుద్ధిసాలదు నీకూ
మల్లీ బొమ్మని పిలచెనే ఓ రామా - గుడ్డోడు నూ తండ్రి కుంటోడు మా తండ్రి
కురూపుమా తండ్రి అనరేగి[10] మా తండ్రి ఓ రామా
దేవతలు ఎరగంగ[11] దశరధుని భారీయ్య
కొడుకు వెంబడి పోయెనుగా ఓ రామా.
లోక దోషనమేమొ[12] చాల బొందితమవ్వా
మల్లి బొమ్మని పిలిచెనో ఓ రామా
కొడుకు చెప్పిన మాట అతియ మీరకుండా[13]
పరనశాలకు[14] నడిచెనో ఓ రామా
ముందు రామసామి ఎనక జానకమ్మ
ఆడవికి పయనమైరే ఓ రామా
అంగల్లో లచ్చన [15] బొంగరాలాడతా
అన్న పయనమూ చూసెనే ఓ రామా

ఆడేటి బొంగరాలటుల పారేసి
అన్న దగ్గరికొచ్చెనే ఓ రామా
వొద్దుద్దు లచ్చనా బుద్ధి సాలదు నీకు
మరలి పొమ్మని పిలిసెనూ ఓ రామా
తల్లిదండ్రులా నీవు కోరెదవు లచ్చనా
అందేడ దెత్తూ నే ఓ రామా
నీ కన్న తల్లిదండ్రి నాకెవ్వరన్నా
పదవన్న వగవనేలా ఓ రామా
పాలకేతులు నీవు కోరెదవు లచ్చనా
అందేడ దెత్తునో అడవిలోనా ఓ రామా
ఆ యడవిలోన పుట్టతేనెలు గలవు
పదవన్నా వగవనేలా ఓ రామా
పండ్లు ఫలహాలు కోరేవు లచ్చనా
అందేడదెత్తునో అడవిలోనా ఓ రామా
ఆ అడవిలో నుండేటి పండ్లు ఫలహాలు గలవు
పదవన్నా వగవనేలా ఓ రామా
పట్టు పానుపు నీవు కోరేవు లచ్చినా
అందేడ దెత్తు ఆ అడవిలోనా ఓ రామా
ఆ అడవిలో నుండేటి చెండు మల్లెలు గలవు
బొండు మల్లెలు గలవు వగవనేలా పదవన్నా ఓ రామా
ఆలి దీవన లేంది అడవులకు రారాదు
మల్లి పొమ్మని తెలిపెనూ ఓ రామా....
అన్న చెప్పిన మాట అతి మీరకుండా
పరనశాలకు నడిచెనే ఓ రామా
పరనశాలలోనా ఊరిమల్లెపు దేవి[16]
పగడకాయలాడుతుందో రామా

కళదప్పి[17] సాములూ నగరికీ వచ్చినా
కారణామే మనడిగెనే ఓ రామా
ఆలిదీవెన లేందే అడవులాకు బోరాదు
దీవెనె యిమ్మనెనే ఓ రామా
అడవిలో నుండేటి నోటి వాసనతోన
పండ్లు ఫలహాలు నీటుగా తెచ్చిచ్చి
వదిన పాదాలకు దండము బెట్టెనో ఓ రామా[18]

పై గేయంలో లక్ష్మణుడు వీధిలో బొంగరాలాడుతున్నట్లు చె పల్నాటి వీరచరిత్రలో బాలచంద్రుడి బొంగరాలాటను తలపింపచేస్తోంది.

శ్రీరామ వానవాస ఘట్టాన్నే ఈ క్రింది గేయంలో మరో : వర్ణించడం జరిగింది.

"పోయి వచ్చెదము సె. వొసగుము జనకా మ్రొక్కెదము
పోయి వచ్చెదమయ్యా పొందుగ సెలవొసగు
తమ్ముడగు భరతునికి నగరాజ్యమొసగుము
అమ్మా కౌసల్యా సుమిత్రా ఓకైకా మాయమ్మ నీవు
ముగ్గురు తల్లులాకు ముదముతో వందనములు
దీవించి పంపుము దివిజులు మెచ్చగ
వందానమయ్యా విశ్వామిత్ర ఓ గురువర్యా
నీకు వందనమయ్యా నీ పాద పద్మములాకు
ముందుగ వేడితి పొందుగ శలవిమ్ము
మునివేషములతో జానకి నారచీరాలతో పొమ్మని సెలవొసగె
పొందుగ కైకమ్మ నాకు. సౌమిత్రికి సంతోషమాయెను
అయోధ్య విడిచి మముగన్నట్టి తండ్రి నెడబాసీ నిర్దోపి అయిన
తమ్ముడగు భరతునికి నగరాజ్యమొసగము సంతోషము మేము

హితులార రాండి స్నేహితులార మీరైనరాండి
హితులార మిము విడచి విపిన భూముల కెదుట
జానకి తోడుగ జనుచున్నవారము ధరణీలో కలవాయి
రెడ్డెప్ప దానుని కాపి రక్షింపుము కౌసల్యా వరపుత్ర''.[19]

## రామ భరతుల సంవాదం :

భరతుడి భ్రాతృభక్తికి ముగ్ధులయినవారు జానపదులు. లక్ష్మణుని సేవానిరతి వారినాకర్షించినట్లుగానే భరతుని నిష్కళంక రామభక్తి జానపదుల్ని విపరీతంగా ప్రభావితం చేసింది.

అందుకే ప్రతి తమ్ముడికీ అన్న రాముడిగానే భావింపబడుతాడు

ఈ క్రింది గేయంలో రామ భరతుల సంవాదం ఈ అంశాన్నే ధ్రువీకరిస్తుంది

భరతుడు : రామచంద్రుడు అరణ్యవాసము పోయెనని
తెలియంగానే భరతుడుకి బో దుఃఖమైంది. కైకను నిందించెను.
అన్న లేని అయోధ్యలో తానుండలేనని తలపియు
అడవులన్ని తిరిగి తిరిగి అన్న రాముల చూసెను.
తానపుడు కనిపించగానే రామ రామ అనుచును
నయముతోనే పోయి రాముల పాదములను
బట్టెను. నీచురాలు కైక కోరిన వరములనెవరుగను
నాదు ప్రార్థనలాలకించి రమ్ము పోదమయోధ్యకు

రాముడు : కైక తల్లినేరమందున లేసమేమి లేదయ్యో
తండ్రి ఆజ్ఞ పాలనకునే తరలి అడవులకొస్తిమి
భరతుడా నా చిన్ని తమ్ముడ క్షేమమే తల్లి దండ్రులు
గురువు విశ్వామిత్రులకు ను కుశలమే పురజనులకు

భరతుడు : అన్న వినుము నా కన్న తండ్రి నిన్నునే చనిపోయెను
సుతులు లేని సమయమున దశరథుడు మరణము చెందెను.

రాముడు : తమ్ముడ భరతయ్య మనిమికవుండి యేమి సేతుము
మునికుమారులు[20] కన్న తండ్రులకు ముందు పెట్టిన శాపము

భరతుడు : నాదుతల్లి సీత పదముల బాధలకు నేనోర్వను
నాదు ప్రార్థనలాలకించి రమ్ము యోదమయోధ్యకు
(భరతుడాడిన మాటలకు శ్రీరామచంద్రుడు యేడ్చియు)

రాముడు : నా ముద్దు తమ్ముడా నా పలుకులాల కింపుము
అడవి కొచ్చుటకేమి నేరము అన్నీ నాతో తెలుపుమా

భరతుడు : ఏమి వేడుకలంటు వస్తివి విపిన భూముల ఎదుటకు

రాముడు : ఏమి చెప్పుదు తమ్ముడనే తల్లి దండ్రుల అజ్ఞతో
ఈ దినముగ పదునాలుగైదేండ్లుండి మళ్లి వస్తము.

భరతుడు : అన్న నిన్ ఎడబాసి నేనయోధ్యపురములో వుండను
పదవుగ[21] పదిరెండు నిముషములైన నేనచటుండను.

రాముడు : తమ్ముడా భరతయ్య నీవిది తప్పుగా భావింపకు
కన్న తల్లుల కష్ట బెట్ట ఏ కారణం బేమున్నది

భరతుడు : కారునంబేరుండగా[22] కౌసల్య మొగమెటు చూతుము
అన్న నీ పాదూకలిచ్చి నంది గ్రామము నుందుము

రాముడు : వేడుక పట్టాభిషేకమునకు ననుమతిస్తిమి తమ్ముడా
జరగవలసిన దంతయును జరుపింపవలయును తమ్ముడా
ధరణి శ్రీరామపురము నిలిపిన శ్రీ దొర
విద్య చెప్పిన గురువుగారిని ముందు పూజింప''.[23]

పై గేయంలో రామాయణంలోని శ్రీరామపాదుక పట్టాభిషేక ఘట్టాన్ని గూర్చి పాడుకోవడం జరిగింది.

## భరతుడి భక్తి:

రామాయణ మహాకావ్యంలో భరతుని పాత్ర చిన్నదయి నప్పటికీ ఆపాత్ర పట్ల జానపదులకు అపారమైన అభిమానం, సానుభూతీ వున్నాయి. అందుకే రాముడి పైన వున్న భరతుడి భక్తిని పాటలుగా కట్టి పాడుకొని పరవశించారు.

" రామచంద్రుడు అరణ్యవాసము పోయేనని తెలియంగను
భరతుడుతో దుఃఖమొంది కైకను నిందించెను.
అన్నలేని అయోధ్యలో తానుండలేనని తలసియు
అడవులన్ని తిరిగి తిరిగి అన్న రాముల చూసెను.
దానవుడు కనపించిగానే రామరామరామ అనుచును
నయముతోనే పోయి రాముల పాదములను బట్టెను
నీచురాలు కైక కోరిన వరములు నే నెరుగను
నాదు ప్రార్థన లాలకించి రమ్ము పోదామాయోధ్యకు
కైక తల్లి నేరమందున లేన పేమి లేదయ్యో
తండ్రి ఆజ్ఞ పాలనకు నేతరలి అడవుల కొస్తిమి
భరతుడా నాచిన్ని తమ్ముడ క్షేమమే తల్లిదండ్రులు
గురువు విశ్వామిత్రులకును కుశలమే పురజనులకు
అన్న వినుము నాకన్న తండ్రి విన్ననే చనిపోయెను
సుతులు లేని సమయమున దశరథుడు మరణము చెందెను
తమ్ముడ భరతయ్య మనమికవుంది యేమిసేతుము
ముని కుమారులు కన్న తండ్రుడుకు ముందు పెట్టిన శాపము
నీదు తల్లి సీత పదవుల [24] బాధలకునే నోర్వను

నాదు పార్థన లాలకించి రమ్మ్మ పోదమయోధ్యకు
భరతుడాడిన మాటలకు శ్రీరామ చంద్రుడు యేడ్చియు
నా ముద్దు తమ్ముడ నా పలుకు లాలకింపుము
అడవి కొచ్చుటకేమి నేరము అన్ననాతో తెలుపుము
యేమి వేడుకలంటు వస్తిమి విపన భూముల యెదుటకు
యేమి సెప్పుదు తమ్ముడనే తల్లీ దండ్రుల అజ్ఞతో
ఈ తినముగ పదునాలుగై దేండ్లుండి మల్లి వస్తము
అన్ననిన్ యెడ బాసినే నయ్యోధ్య పురములో వుండను
పదవుగ పదిరెండు నిముషములైననేన చఱుండను.
తమ్ముడ భరతయ్య నీవిది తప్పుగా భావింపకు
కన్న తల్లుల కష్ట బెట్టుట కారణంబే మున్నది
కారుణం బేరుండగా కౌసల్య మొగమెటు చూతుము
అన్న నీ పాదూకలిచ్చి నంది గ్రామము నుండుము
వేడుక పట్టాభిషేకము నీకు యిచ్చేస్తిమి తమ్ముడా
జరగ వలసిన దంతయును జరుపింప వలయును తమ్ముడా
ధరణి శ్రీరామపురము నిలపిన శ్రీదొర విద్య చెప్పిన
గురువు గారివి ముందుగా పూజింపు ''

## చుప్పనాతి అగడం :

వనవాసం వెళ్ళిన లాముడు పంచవటిలో పర్ణశాల వేసుకొని నివాసం వుంటాడు. లక్ష్మణుడి సేవలో సీతారాముల పంచవటి జీవితం సజావుగా సాగిపోతోంది. ఆ సమయంలో .... అక్కడికి వచ్చింది చుప్పనాతి చుప్పనాతి. అంటే శూర్పణఖ శూర్పణఖేగనుక లేకుంటేముఖ్యంగా హనుమంతుసుగ్రీవుడు, వాలి, విభీషణుడు వంటి పాత్రలు, రామరావణ యుద్ధం, రాక్షస సంహారం వంటి ప్రముఖ ఘట్టాలు కనుమరుగై పోయేవి.

రామయణంలో చుప్పనాతి పాత్ర భారతంలో శకుని పాత్ర లాంటిదని జానపదుల భావన, శూర్పణఖ పైన అనేక రకాలుగా పాటలు కట్టి పాడుకున్నారు.

చిత్రకూట అడవిలో రామలక్ష్మణులపై ప్రేమ పుట్టి కొచ్చిన శూర్పణఖ, లక్ష్మణుని చేత ముక్కు చెవులు కోయబడి ఘోరంగా అవమానించబడ్డది. దానికి ప్రతీకారంగా అన్న అయిన రావణునికీ వారి సీతను చెరబట్టమని చెప్పిన విధానం స్త్రీల మనస్త్వత్వానికి చక్కని నిదర్శనంగా నిలుస్తుంది. ఇదొక చెక్కభజన పాట

"అన్న రావణ ఆటకంపుము విన్న వించెద నాయకా
విన్న వించెద నాయకా

చిత్రకూట అడవిలోన జరిగినా సంగతీ నాయదీ ॥ చిత్ర ॥
జరిగినా సంగతీ నాయదీ ॥ అన్న ॥

దశరథాపుత్రులంటా రామలక్ష్మణు లిద్దరూ ... రామలక్ష్మణు లిద్దరూ
కామకేళికి కలయ రమ్మని కష్ట పెట్టిరి మనుజులు ॥ కామ ॥
కష్ట పెట్టిరి మనుజులు ॥ అన్న ॥

ఒప్పుగా నేను విన్నవించితి గొప్పవారను కొంటినీ - గొప్ప
వారను కొంటినీ

గొప్పవారు వారు కాదు బలమునా నను బట్టిరీ
బలమునా నను బట్టిరీ

బలమునా నను బట్టిరీ ఇక భంగములు గావించిరీ ॥ బల ॥
భంగములు గావించిరీ ॥ అన్న ॥

సీత యున్నది ఆమె రూపము ॥ సీత ॥
చెప్ప శక్యమొ గానిదీ ॥ చెప్ప ॥
ఆమెను వర్ణింపడానికి బ్రహ్మతరములుగానిదీ బ్రహ్మతరములుగానిది
ఎటులనైనా సీత నిప్పుడు ॥ ఎటు ॥
వేగమే శరదీయుము ॥ వేగ ॥ ॥ అన్న ॥

## మాయ లేడి :

శూర్పణఖకు జరిగిన అవమానానికి ఉగ్రుడై, రావణుడు తన చెల్లెలికి అవమానం జరిగితే అది తనకూ అవమానంగానే భావించాడు. ప్రతీకారం తీర్చుకోవాలను కున్నాడు. దానికి ఆమె సీతను చెరబట్టమని చెప్పిన దుర్బోధ మంచి అవకాశంగా తోచింది. వెంటనే మారీచుని మాయాలేడిగా వెళ్ళమని సీతాపహరణకు పథకం వేసుకున్నాడు.

మాయలేడిగా మారిన మారీచుడు పంచవటిలో పర్ణశాల ప్రాంతంలో సీతను ఆకర్షించిన విధానం, దాన్ని పట్టుకొని రమ్మని సీత రామున్ని కోరిన విధం సీతను అలరించినట్లే జానపదుల హృదయాలని అలరించిందనడంలో అతిశయోక్తి లేదు

ఈ క్రింది చెక్కభజన పాటలో సీత కోరిన కోరిక ఎలాంటిదో చూడండి.

రామనోహర రామచంద్రా నాదు కోర్కెలు దీర్చుమా
నాను కోర్కెలు దీర్చుమా
నాదు కోర్కెలు దీర్చుమా బంగారు లేడిని జూడుమా ॥ రామ ॥
అదిగో చూడుము ప్రాణనాధా ఎదురుగా లేడున్నదీ
ఎదురుగా లేడున్నదీ
పర్ణశాల సుట్టు తిరిగీ గంతు లేయుచున్నదీ ॥ రామ ॥
చెవులు శృంగారంబులు దాని కొమ్ములే పిలనంబులు
దాని కొమ్ములే పిలనంబులు
ప్రాణముతో లేడిని పట్టితే మనోహరా - పట్టితే మనోహరా ॥ రామ ॥
చిక్కకున్నాదాని చర్మం తీసిలే మనోహరా ॥ రామ ॥ [26]

## సీతాపహరణం :

అలా బంగరు లేడిని పట్టి తెమ్మని సీత రామున్ని కోరగానే ఆమెకు రాముడు బంగారు లేడి ఎక్కడావుండదనీ ఇది రాక్షసమాయనీ ఎంతో

నచ్చచెబుతాడు. కానీ సీత వినదు. చివరికి భార్య కోరిక చెల్లించడానికి దాని వెంట వెలతాడు. అది చిక్కినట్టే చిక్కి .... అలా అలా.... రామున్ని పర్ణశాలకు దూరంగా తీసుకు వెలుతుంది.

విసుగు చెందిన రాముడు దాన్ని బాణంతో కొడతాడు, అది మారీచుడిగా మారిపోతుంది. హా లక్ష్మణా ! హా సీతా ! '' అంటూ మారీచుడు పెద్దనా కేకలు వేస్తాడు ఆ కేకలు విని సీత తల్ల డిల్లి పోతుంది, రాముడికి ఏదో ఆపద వాటిల్లిందని భావించి వెంటనే వెళ్ళి రామున్ని రక్షించమని లక్షణున్ని కోరు తుంది సీత. ఇది రాక్షసమాయ అని లక్ష్మణుడు ఎంత చెప్పినా సీత వినిపించు కోదు. పైగా లక్ష్మణున్ని నిందిస్తుంది.

ఆ నిందలకు భయపడిన లక్ష్మణుడు గడప కింద మూడు గీతలు గీచి దాన్ని దాటిరావద్దని చెప్పిఅడవిలోకి వెళ్ళిపోతాడు. అదే అదనుగా భావించిన రావణుడు మారువేషంలో వచ్చి సీతను అపహరించుకొని పోతాడు.

ఈ సీతాపహరణ ఘట్టాన్ని జానపదులు ఎంతో హృద్యంగా పాడుకున్నారు

అడవిలో నుంచీ ఆర్తానాదం రాముని గొంతులా వినిపించేసరికి సీత గుండె గుభేలు మన్నది.

'' అయ్యయ్యో నామరిదీ అయ్యేలక్ష్మణా<br>
అడవిలో మీయున్న కతిభారమాయె<br>
ఆ లక్షణా సీతా అనుచు మీయన్న<br>
అలపోవు[27] చున్నాడు మరిది లక్ష్మణా<br>
బంగారు మాయలేడి అది ఒక్కటయ్య<br>
మన పర్ణశాలకు ఎటు వచ్చిపోయె<br>
దాన్ని చూడగానే కోరి తెమ్మనగా<br>
విల్లనంబులు బూని లేడెంట పోయె మీ యన్న<br>
గండబేరుండములు సింహములుండు<br>
ఏమి అపాయము మీ యన్న కిపుడు.''

అలా అన్న సీత మాటలకు తలవంచుకుని లక్ష్మణుదు ఇలా సమాధానం చెబుతాడు.

" ఈ చింత నీ కెందుకు శ్రీ జానకమ్మ
మా యన్న కేమియు భయము లేదమ్మ
మా యన్న కతి భార మైతేను తల్లి
సూర్యుడు మైకప్పి చుక్కలు రాలేను
యూహము లింకను జగము చెడునమ్మ
పగలు చుక్కలు తల్లి భూమిపై వ్రాలూ"

రాముడికి అపాయం జరిగితే కలిగే అనపాతాలు లక్ష్మణుడి నోటివెంట చెప్పించిన రీతి జానపదుల భావుకతకి నిలువుటద్దం,

అలా ఎన్ని విధాలగా చెప్పినా సీత వినదు. పైగా రాముదేలిన సీతను ఏలుకుందామను కుంటున్నావా? " అని నిందిస్తుంది, ఆ నిందను భరించలేని లక్ష్మణుడు మూడు లక్ష్మణ రేఖలు గీచి ఎట్టి పరిస్థితిలోను దాన్ని దాటి రావద్దని నియమం పెట్టి వెలతాడు.

ఆ తర్వాత జరిగిన కథ ఇదీ :-

" లక్ష్మణుడు లేనిచే పర్ణ శాలలో
మరగున దాగుండి మాయా రావణుడు
నారాయణ హరి గోవింద యనుచు
నలినాక్షి ఎదుటొచ్చి నిలచె రావణుడు
హరిభక్తుడే యని మదిలోన తలచి
అతి వేగ భిక్షంబుదెచ్చె సీతమ్మా
భిక్షంబు పట్టక మాయా రావణుడు
పది తలలు జూపగ పడి మూర్ఛచెంద
గడ్డతో పెకలించి రథములో పెట్టి

ఆగ్రగ కోపము [28] చేత మాయారావణుడు
కొండాలగో పెట్టె [29] ధరణి తల్లాడిల్లి
పగలు చుక్కలు తల్లి భూమిపై రాలు
పరమ పావనమైన సీతమ్మ నెవరో
శరదీసి రమిచూను అపుడు జటాయు
పోయేటి రావణుని కనులార జూచి
రధము కూల ఉన్నె అపుడు జటాయు
ఆగ్రగ కోపము చేత మాయ రావణుడు
రెక్కలు పట్టుక భూమికి కొట్టె
పడివున్న సీతమ్మ మూర్ఛయు లేచి
జటాయు నప్పుడు కన్నుల జూచే
అన్నయ్య జటాయా భయమా నీకేల
కలికాలము వాపి [30] నీకు నీనిస్తి
అని జటాయుకు చెప్పి అప్పుడు సీతమ్మ
పోయెను లంకకు రావణుని తోడ
పరగ సంభము పాటి కోదండరామా
నాకు దిక్కెవ్వరు శ్రీరామ చంద్రా'' [31]

పై కలుపు పాటలో సీతాపహరణ సమయంలో రావణుడు జంగమ వేషంలో వచ్చినట్లుగా అన్ని రామాయణాల్లోను వుండగా.... ఇందులో హరి భక్తుడిగా వచ్చినట్లు మార్పు చేయబడింది ఇది జానపదుల హరిభక్తికి తార్కాణం.

## రాముడి పరితాపం :

సీతను పోగొట్టుకున్న రాముని పరితాపం కరుణ రసభరితం. సీత కోసం ఆతను శోకించిన తీరు ఆతని ఏకపత్నీ వ్రతాన్ని నిరూపిస్తుంది.

"భూపుత్రి ఎటు బోయరా ఓ లక్ష్మణా మీ వదిన సీతేదిరా
భూపుత్రి విడనాడి యెందుకు వస్తివి
తల్లి బొంకించి రావణుడు లంక కెత్తుకపోయె
వెన్నెల తేటైన వెలది బంగరు కన్య
ఏనాటి కైనానో కనవచ్చునో సీతా
శివుని విల్లు విరచి సీతను పెండ్లాడితే
మాయా రావణుడొచ్చి లంక కెత్తుకపోయె
బ్రతుకు లేదుర సీతగోరారణ్యములోన
పతిని వంటిగా విడచి బ్రతుక లేదురా సీతా
వీడెంత పని జేసెరా ఓ లక్ష్మణా వీడెంత పనిజేసెరా
వనజాక్షి మీ వదిన వద్దనే వుండమంటి
పనిబూని యిటు వస్తివ లక్ష్మణా పగబూని యిటు వస్తివా
కాననంబున సీత కనబడదాయెను
వనజాక్షి యెటుబోయరా ఓ లక్ష్మణా మీ వదిన సీతేదిరా
ఏడేడు లోకాలు పదునాల్గు భువనాలు
తిరిగైన మని మొస్తిమ ఓలక్ష్మణావెతికైన మనమొస్తిమా"[31]

## అశోక వనంలో సీత శోకం :

అశోక వనంలో సీత లంకకు వచ్చి రక్షింపమని రాముని వేడు కుంటుంది. తన భర్తను గజేంద్రుని కాచిన ఆ శ్రీ మహావిష్ణువుగానే భావించింది.

తన ఆనవాలు తెలుసుకోవడానికి తన నగలు కొండ పేటున వేశాననీ, ఈ క్రింది కోలాట పాటలో రామున్ని వదలి యిప్పటికీ సంవత్సర మయిందనీ సీత శోకిస్తుంది.

"ఎక్కడున్నాడో శ్రీరాముడు ఏదిక్కునున్నాడో
ఎక్కడున్నాడో ఏనా మక్కువ పెనిమిటి

దిక్కులేకను నేను చిక్కితి దనుజూచే
పాపిష్టి బంగారు రూపాని మృగ మొచ్చే[32]
నే పట్టి తెమ్మని యేల పలకితి రామా
మాయా రక్కాసుడు ఓ యని అరవగ మాయన్న
లక్ష్మణుతో అదిరి పలికితి నేను
పైట చెరగు చించి యెల్లమిన సొమ్ములు
మూట గట్టియు కొండపేటు పై వేసితి
కొండమీదనే వుండే కోతి గుంపులు గూడి
కోదండ పాణిగితోయమాని తెల్పెద
మాయా రక్కసుని బారి చిక్కితినేను
యెటువలెనైనా పతిని చేరబోదునింక
పతిని వంటిగ విడిచి పదిరెండు నెలలాయె
వంటి దానను నేను ఎటుల వుందూ స్వామి
ఎక్కడున్నాడో శ్రీహరి నన్నెటు మరచినాడో
యాడనున్నాడో నా నాధూడూ గజేంద్రుడి
కాపాడిన దేవుడవు పాలాన చేయుమురా
ఎందుకు రామా యిది క్రుచ్చంచు ఎరుగువ దేవ
సందేహములు మాని పంపుదమని శక్తి ముందు
పరమేశ్వర నన్ను బాధింపకు
శ్రీపతి వినవేసితి[33] సురుడు నాచిత్త మెరుగాడు
కోపి పైతేను గోరా శక్తియునా గటిగా
పైకి విడువగ నాకు దిక్కెవ్వరు
పరమాత్మ వినుమానను రక్షించే దిక్కెవ్వరిచట
నాకు దిక్కెవ్వరు ఎవ్వరు రక్షించేరు
యిప్పుడు నాకూను మరణము దవ్వదు
పరగ కంభము పాటి నవ మహేంద్రుడు నీవు
కాసి రక్షింపుము కౌసల్య వరపుత్ర ''

సీత కష్టాలు తమ కష్టాలుగా, సీత శోకం తమ శోకంగా సీత ఆవేదన తమ ఆవేదనగా భావించారు జానపదులు. జానపదులకు సీత ఒక మాతృ మూర్తి. రాముడొక తండ్రి, అందుకే ఆ తల్లి పరితాపం జానపదుల హృదయాలను కలిగించి కన్నీటి కాలువలుగా ప్రవహించింది.

అశోక వనంలో భర్తను గూర్చి తపించే సీత పరితాపం జానపదులు తమ దిగానే భావించారు. అందుకే సీత శోకం పైన అనేక పాటలు వెలువడ్డాయి. సీతా రాముల పరివేదన ఒకే పాటలో ఎంతో ఔచిత్య భరితంగా పాడబడింది. ఇదొక చెక్క భజన పాట.

సీత : "ఇంకను రాముల కనుల జూసేనా నేను ఈ వనమునుండి వెడలేనా
ఆకట రాముడు నన్ను అదమర చెనేమొ - వకరింట వుండుట ఏల కలిగెనాకు
పాపిష్టి మృగమేల వచ్చెనో - దాన్నిపట్టుక తెమ్మంటి భర్తను
ఆవేల మృగ మెంట సామి పోయుండగ అపుడింత తెలియక ఆపాదపాలైతి
నా ముద్దు మరిది లక్షణుతో నేను సయ్యాటపడితి సద్గురుతో
పురుషుని ద్రేహము పోరుచుండగ నేను చూచి చూచి కనులు మూలలై పోయెను
నన్ను పెండ్లాడిన రాములు - ఏల - నా జాడతెలియకున్నాడు
ఎన్నాళ్ళు కౌగింటి ఎడబాసి వుందును చూచి చూచి కనుల మూతలై పోయెను.

రాముడు : ఏమి చేయుదు నేను సీతా - నీవు ఎటు పోతివో లోకమాత
నేను మృగమును ద్రుంచి నేర్పుతో పోవగ సామరంబున యింతపని జేసెనెవ్వడో.

అవనీలోనే బ్రతుక జాలానీతో కలయకుండగ జన్మమేల
కాననమంతయు గల దిరిగి నేనొస్తి నా మనసు నిలవాదు వో సఖియా
కోసాల దేశంబు విడచీ యింత గోరారణ్యము చేర నడచి
వాసిగ యిచట బో గ్రామములన్నియు కాసురంబుగ నేను బ్రతుకు
దామనుకొంటి
కడు భక్తి గల ముద్దుగుమ్మా - నాకు కనిపించవే పసిడి బొమ్మా
దేశ దేశములన్ని గాలించి వైచితి ఎక్కడో నీ జాడ తెలియకున్నది
ధరణీలో కలవాయి- కైలాసవాసుడు కాసి రక్షింపుము కౌసల్యావరపుత్ర·

ఈ పాటనే 'లంకాదహనం' వీధి నాటకంలో కూడా పాడుకుంటారు.

## రామాంజనేయుల తొలి పరిచయం :

రామ లక్ష్మణులు సీతాన్వేషణ చేస్తూ పంచవటిని వదలి ... మాల్యవంత సమీపానికి చేరుకుంటారు.

మాల్యవంతం పైనున్న సుగ్రీవుడు, అతని అనుచరులయిన జాంబవంత హనుమంతాదులు వారిని మొదట చూస్తారు.

ముని వేషధారులైనా విలనంబులు చేత పట్టుకొని వున్న రామలక్ష్మణులను చూసి చాలా ఆశ్చర్యపోతారు. ముని కుమారుల్లా కనిపిస్తున్నా మహావీరుల్లుగా వున్నారనీ గ్రహిస్తారు. వారితో పరిచయం చేసుకొని వాలిని హత మార్చి సుగ్రీవుడికి కిష్కిందాధిపత్యం కట్టించాలని సుగ్రీవుడి అనుచరుల కోరిక. అయితే కనిపించినవారు ఎవరో ఎలాంటి వారో ఎందుకొచ్చారో తెలుసుకోకుండ స్నేహం చేయడం ప్రమాదం కదా. అందుకే ముందుగా హనుమంతున్ని వారి విషయం తెలుసుకురమ్మని పంపిస్తారు. హనుమంతుడు వారిని కలుస్తాడు. వివరాలు అడుగుతాడు. దానికి రామలక్ష్మణులు సమాధానం చెబుతారు. దాంతో వారిమధ్య స్నేహమేర్పడుతుంది.

ఈ అంశాన్ని సంవాద రూపంలో ఈ క్రింది పాట తెలుపుతుంది. ఇదొక పడి పాట. ఈ పాటను చెక్క భజనలోను వీధి నాటకాల్లోనూ పాడుకుంటారు.

హనుమ : ఎవరయ్యా మీరు ఈ వనములో ఎందుకున్నారు - దేవా
పున్నమి చంద్రుని వంటి పోలను మీ ముద్దు మోములు
సిద్ధముగా మీరిద్దరు ప్రాసుద్దిగా ఎరుగంగ బలుకుమా

లక్ష్మ : కపిరాజా వినుము మేమిద్దరము అన్నదమ్ములము - దేవా
ఇనవంశకులమయ్యా యితను రాఘవుడయ్యా నేను
లక్ష్మణుడను ఈ మాట నిజమయ్యా

హనుమ : మహానీయులారా మీదెవ్వారు గనిపుణ్యులారా - దేవా
తల్లిదండ్రులెవరయ్యా పురుషోత్తములారా విశదముగ తెలుపు యిన
పేరుకాయెను

రామ : అయోధ్య మాదీ రాజధాని తండ్రి దశరథుడూ కౌసల్య సుమిత్ర
కైకయి తల్లులు, భరత శత్రుఘ్నులు తమ్ములు గలరయ్యా

హనుమ : వినుము శ్రీరామా సుగ్రీవుని బాంధ్యమయ్యా
వాలిసుగ్రీవులకు వరుస మేనల్లుడను అంజని
సుతుడాను హనుమంతుడను పేరు ధంటిలోకిలవాయి
రెడ్డెప్పవాసుని34 కాసి రక్షింపుము కౌసల్య వరపుత్ర.

## వాలి వధ - వాలి శాపం :

అలా హనుమంతుని ద్వారా రామసుగ్రీవులకు మైత్రి ఏర్పడింది. మాల్యవంతం మీద ఏడుతాడిచెట్లని ఒకేసారి కూల్చి, దుందుభికాయాన్ని కూలదన్ని తన శక్తిని నిరూపించుకున్నాడు రాముడు అతర్వాత వాలితో యుద్ధానికి సిద్ధం కమ్మంటాడు రాముడు.

"లెమ్ము సుగ్రీవా నా మాటలనమ్ము సుగ్రీవా - దేవా
నమ్మకముగా నాదుమాటలు నెప్పుదిగ నీ మనసులోపల
యిమ్మగ కిష్కింధపురము యిపుడే చట్నంబు కట్టెద
వాలిని బట్టి బాణముతోనే వడిగానే కొట్టెద
తారను నీ వశము చేసెద అంగదుని యువరాజు జేసెద
నాదు తమ్ముల్లో నాల్గవ తమ్ముడే శ్రీ సూర్యనందన
వేగమే పోయి వాలిని నీవు రమ్మని పిలవూ
నిన్ను జూచిన వెంటనే అతి కోపముతో ఆ యింద్ర తనయుడు
రొప్పుతూ బెబ్బులి వాలే వచ్చి నీ పైగాను దూకును
అత్ అదిగో వాలీ వస్తున్నాడు పైరాముతోన
వచ్చెనంటూ భయములేదిక యుద్ధమునకు సిద్ధపడుము
నేను వున్నంతవరకు భయము లేదు సూర్యకుమారా".

అని సుగ్రీవునికి ధైర్యం పోసి పంపిస్తాడు రాముడు. అయినా రాముడు ఏమీ చేయలేక పోతాడు. ఓడిపోయి తిరిగి వచ్చేస్తాడు సుగ్రీవుడు.

"అయ్యో శ్రీరామా అభయము యిచ్చి పంపితివయ్యా - దేవా
ఆశతో నేపోయినందుకు మోసమాయెను రామచంద్రా
పెక్కు విధముల వాలి చేతిలో కష్ట పడితిని ఖండితముగా",

అని సుగ్రీవుడు రాముడితో చెప్పి వాపోతాడు. తన పొరబాటుకు కారణం చెబుతాడు రాముడు.

"పొరబాటు పడితి సుగ్రీవా మీ రూపులు వగచే
మల్లి వెల్లుము యుద్ధమునకు మెడకు పూలహార మేసెద
ఒక్క బాణముచేత వాలిని వసుధ పైనే కూలుస్తానిప్పుడు".

అన్నమాట ప్రకారం వాలిని ఒక్కబాణంతోనే నేల కూలుస్తాడు రాముడు నేలకూలిన వాలి చెట్టుచాటు నుంచీ దెబ్బ తీసిన రామున్ని చూడనే చూస్తాడు.

" అయ్యోరామా నేను చేసిన నేరమేమయ్య కోతిని చంపెదరరాజులు
ఖ్యాతిగా భూలోకమందున కోతి మాంసము తినను నీవు కోరి
తినకోరితివా రామా
నేను చూడగనూ సుగ్రీవుని చేపట్టినావూ పట్టినందుకు ఫలములేదిక
కష్టదినములు కలిసి వచ్చెను ఒక్కనీవే దీన జనావికి నాకు గ్రక్కున
మోక్ష మొసగుము"

అని వాలి రామున్ని మోక్ష మడుగుతాడు. అయితే దొంగ చాటుగా దెబ్బ తీసినందుకు శాపం ఇస్తాడు. మా సతీపతుల్ని ఎడబాపి మా సంసారం భగ్నం చేసినందుకు వాల్మీకి వనంలో నీవును నీసతిని విడనాడవలెననీ కన్న పుత్రుల వల్ల నీకు కష్టమొచ్చునని శాపిస్తాడు. ఆ శాప ఫలితంగానే ఉత్తర రామాయణంలో నిండు చూలాలయిన సీతను రాముడు అడివికి పంపించినట్లు జానపదులు భావించారు. అందుకే అవాల్మీకమైన వాలిశాప వృత్తాంతాన్ని కల్పించి ఉత్తర రామాయణ కథకు ఇక్కడే బీజవాపం చేశారు.

"సతీ పతులను నీవు యెడబాసిన శౌరివైనావు
ఎదురుగా రాలేక నీవు పొదల చాటున దాగివుండి
దొంగవలె బాణంబు వేసి పృధివికి నను కూల్చినావు
యింతే కాదయ్యా నీ కార్యము చాలా వున్నాది
వంటిగా వాల్మీకి వనములో వనితను విడనాడవలెను
కన్నపుత్రుల వల్ల నీకు కష్ట మొచ్చును ఖండితముగా...."

వాల్మీకి రామాయణం పూర్వ భాగమంతా ఒకటిగాను ఉత్తర రామాయణ మంతా మరొకటిగాను విడి విడిగా కనిపిస్తాయి. ఆ దోషాన్ని పరిహరించేందుకు వారి శాపవృత్తాంతాన్ని కల్పించి పూర్వోత్తర రామాయణాలను సమన్వయం చేసి చక్కని ఔచిత్యాన్ని పాటించారు జానపదులు. శహభాష్ హేతు కల్పనంటే రికే చెల్లింది మరి.

## లంకిణి :

రామాయణంలో లంకిణ పాత్ర అప్రధానమైన దైనప్పటికీ జానపదుల దృష్టి కోణం నుంచీ తప్పించుకో లేదు. లంకిణి పైనా పాటలు కట్టి పాడుకున్నారు

ఈ క్రింది కలుపు పాటలో లంకిణీ పవన పుత్రుల సంవాదం చిత్రీకరించ బడింది,

లంకి : ఆంజనేయా రారా నాతో అడ్డుదాటి పోరా నీవు
హను : రాక్షసాధమా ఎవరు నీవు, అప్పల్లమ్మ వలె చప్పరించెదను

లంకి : పేరు లంకిణినిరా నిన్ను బింకమున ద్రుంచెదనూ నేను
మర్కటాధమా ఎక్కడ పోదువు వక్ర గుద్దుతో చంపె వేసెదను

హను : వాయునందను నేను నిన్ను వధియించెదనే
రామబలభంటును ఆంజనేయుడను తప్పక నిన్ను చంపి వేసెదను

లంకి : నన్నుతాంగ రారా నిన్ను శరణులు వేడెద నేనూ
పరి పరి విధములూ ప్రార్థన చేసెద తప్పక నిన్ను శరణులు వేడెద.

## సీతా రావణుల సంవాదం :

అశోకవనంలో వుంచిన సీతను రావణుడు అప్పుడప్పుడూ వచ్చి పలుకరించి రాముని నిందించి మనసు మార్చుకోమని చెప్పి దూషించి వెలుతుంటాడు. దానికి సీత రాముడెప్పటికైనా వస్తాడనీ, నీ తలలు త్రుంచుతాడనీ చెబుతుంది.

ఈ అంశమే ఒక సామూహిక భజన పాటలో ఎంతో రమణీయంలో వర్ణించబడింది,

రావణు : పలుకవేమి కొమ్మా బంగరు చిలుక ముద్దుగుమ్మా
కలికి కులుకల చిలుకరో వేగమే లొలుకుచు
నీ ముద్దు పలుకవే నాతో....

సీత : ముదివేల పోరా రావణా నీ కోటలు కూలునురా
నీలాంగుని నిందించకుమా కాలెము దూతలు కాల్చి చంపెదరు

రావణు : ఎన్ని యనిన పోనే నేను నిన్ను మానలేనే కన్యకామకీ
నిను కామకేళిలో తప్పక నిన్ను శరణులు తీసుకుందూ
రాముడనగనరుడే రణములోనన్ను గెలువలేడే
రాముని రణమున రయమున కూల్చెద తప్పక నిన్ను వల్లెను నేను.

## లంకానగర వైభవం :

లంకానగర వైభవాన్ని గురించి చెప్పే ఒక కోలాట పాటను డా॥ ఎస్. గంగప్పగారు తన ''జానపద గేయ రామాయణం'' అన్న ఒక చిన్న పుస్తకంలో ఉటంకించారు

''సీత శ్రీరాముడు శ్రీరామచంద్రుడూ చిన్నపొయ్యి నాదమ్మా
శృంగారి వనములో చిన్నపొయ్యి నాదమ్మా
ఉక్కువే దూలాలు ఉక్కువే స్తంభాలు ఇవి ఎవరి నగరి సాలి
చక్కని శ్రీరామ కుంభ కర్ణుని నగరిసాలి
ఉకువే దూలాలు ఉకువే స్తంభాలు ఇవి ఎవరి నగరి సాలి
చక్కని శ్రీరామ ఇంద్రజిత్తు నగరిసాలి
ఇప్పివే దూలాలు యిప్పివె స్తంభాలు ఇవి ఎవరి నగరిసాలి
చక్కని శ్రీరామ కుంభ కర్ణుని నగరిసాలి
వెండివే దూలాలు వెండివే స్తంభాలు ఇది ఎవరినగరిసాలి
చక్కని శ్రీరామ రావణుని నగరిసాలో''.[35]

## అశోక వనంలో హనుమంతుడు :

రాముడిచ్చిన అంగుళీయకాన్ని తీసుకొని హనుమంతుడు అంగద జాంబ వంతాది కపి వీరులతో దక్షిణ దిక్కుగా బయలు దేరుతాడు. అక్కడ సంపాతి ద్వారా సీత విషయము తెలుసుకుంటాడు అందరి ప్రోద్బలంతో హనుమంతుడు సముద్రాన్ని లంఘించి లంకను చేరుతాడు. అక్కడ అడ్డు వచ్చిన లంకిణిని హత మార్చుతాడు. ఆ తర్వాత అశోకవనం చేరి సీతను గుర్తు పడతాడు ఆ సమయంలో హనుమంతుడు ఎంత చెప్పినా ఆమె అతన్ని నమ్మదు. అతను ఆమె పలుకు కోసం ఎంతో ఆరాట పడతాడు.

> ''ఏమమ్మా సీతమ్మ పిలచిన పలుకవు - పిలచిన పలుకావూ
> పిలచిన పలుకావూ కనులెత్తి చూడావు - కనులెత్తి చూడావూ
> దీవించినను బంపమ్మా ఓ సీతమ్మ-సెలవిచ్చి నను బంపమ్మా ॥ఏమ॥
> పగవోన్ని గాదమ్మా నీ పాద సేవకున్ని - నీపాద సేవకున్ని
> ఫలమిచ్చి నను బంపమ్మా ఓ సీతమ్మా
> రఘువంశ తిలక రామచంద్రుని భారీయ్య - రమణీ మాట్లాడవమ్మా
> ఓ సీతమ్మా దేవీ మాట్లాడవమ్మా'' ॥ ఏమ ॥

ఇదొక చెక్క భజనపాట.

## చూచి రమ్మంటే కాల్చి వచ్చాడు :

చివరికి సీత అతన్ని నమ్ముతుంది. రామలక్ష్మణుల క్షేమ సమాచారాలతో బాటు రాముడి అంగుళీయకాన్నిస్తాడు హనుమంతుడు. తిరుగుసందేశం కోసం ఆమె శిరోరత్నాన్ని గ్రహి_డు. తిరిగి వెళ్ళేటప్పుడు ఆకలి అవుతుందంటాడు. అందుకా తల్లి కిందపడిన పండ్లు మాత్రమే భోంచేయ మంటుంది. ఇంకేం.... అమ్మ ఆజ్ఞ అయింది. ఇక అడ్డేముంది వనమంతా తల్లకిందు చేస్తాడు.

అతన్ని పట్టుకోవడానికి రాక్షసులు దండెత్తి వస్తారు. చివరికి రావణ పుత్రుడు ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రం వేసి బంధించి రావణ సభలోకి తీసుకుపోతాడు హనుమంతున్ని. రావణుడు ఉన్నతాసనం పైనుండడం చూసి తన వాలాన్ని పెంచి చుట్ట చుట్టి అతని కంటే ఎత్తులో కూచుంటాడు. రావణుడుగ్రుడై పోతాడు ఆ సమయంలో వారి మధ్య జరిగిన సంభాషణ వీరరసస్ఫోరకమై హనుమంతుని ప్రతాపాన్ని ఇనుమడింప చేస్తుంది.

రావణు : ఎవరు చెప్పిరి లంకజూడా - నిన్ను పంపిరి కోతివాడా
దివిజులనైను తేరిజూడగ రాదు
లవణ సాగర మెట్లు లంకించి వచ్చితివి.

హనుమ : సంపాతి సీతమ్మ జాడానాకు యింపుగ తెల్పి రావణుడా
సొంపుగ దశరధ సూతులేరాములు పంపించగా
వస్తిని దివిజులు మెచ్చగను

రావణు : చిక్కితివిరా పిల్లివలనే - నీకు - దిక్కెవ్వరు చెప్పుకోరి
రక్కసులకు చిక్కి ఎక్కడ పోదువు గ్రక్కున నీతోక కాల్చి
పంపెదమయ్యా

హనుమ : నీకు నీతాతకు చిక్కనూ నేను - రక్కసులను చంపి
పోదును తోక కాల్చిన లంక తోకతో కాల్చుదు - పోకిరి వాడని
బలియిస్తు రాములకు

రావణు : నా వంటి వాడా శ్రీరాముడు - వాడు ఈ త్రోవత్రొక్క భయపడును
దేవాతలనుబట్టి కావారమణగించి భూలోకమున కీర్తి పొందితిరా నేను

హనుమ : నిను బట్టి వార్ధిలో ముంచినా వాన్ని దునుమాడిన శ్రీరామ[36] బంటును
ధనువెక్కు పెట్టియు ధన్యుడై బాణమున పదితలలు
దునుమాడి సీత నెత్తుకపోదు.

ఆ మాటతో రక్కసులు ఆతని తోకకు నిప్పు పెడతారు, దాంతో పాట కూడా ధృతగతిలో సాగిపోయి హనుమంతుని ఆగడాన్ని చిత్రీకరిస్తుంది.

(ధృతగతిలో) : ''లంకించి అంజనేయుడు - లంకను కాల్చేసె
వనమంతా పెరికేసె - తల్లకిందుసేసె
పోతాడు హాంజనేయుడు సముద్రాల దాటి
సీతమ్మ హానుబాలు[37] రాముల సేతికిచ్చే''.

## ముద్దు టుంగరం :

అలా హనుమంతుడు రాముడి అంగుళీయకాన్ని సీతకిచ్చి చూచి రమ్మంటే ఏకంగా లంకనే కాల్చి వెళ్ళిపోతాడు.

ఆ తర్వాత రాముడి ఉంగరాన్ని చూసి రామున్ని చూసినంత ఆనంద పడి పోతుంది సీత.

ఉంగారమా ముద్దుటుంగారమా
మా రంగయిన రాములేఉంగారమా ॥ ఉంగా ॥
ఏ కాకెత్తు కొచ్చెన ఉంగారమా
నిన్ను గద్దెత్తుకొచ్చెనా ఉంగారమా ॥ ఉంగా ॥
కాకెత్తుక రాలేదు ఉంగారమా
నన్ను గద్దెత్తుక రాలేదు ఉంగారమా ॥ ఉంగా ॥
మరి ఏదోవ నొస్తివే ఉంగారమా
నీవే దోవ నొస్తివే ఉంగారమా ॥ ఉంగా ॥[38]

జక్కిలోను కోలాటంలోను పాడుకునే పై పాటలో ఉంగరానికి సీతకు సంభాషణ జరిగినట్లు చిత్రించడం విశేషం.

## హనుమంతుడు తిరిగొచ్చాడు :

సీతను చూసిన హనుమంతుడు కిష్కిందకు తిరిగొచ్చాడు. అందరి సమక్షంలో సీత కబురు చల్లగా చెప్పాడు. అందరి ఆనందానికి అవధుల్లేక పోయాయి.

లంకకు ఎలా వెళ్ళ గలిగావు. సీతానెలా చూసి వచ్చావని ప్రశ్నల వర్షం కురిపించారు. చివరికి రాముడు కూడా అడగనే అడిగాడు. అప్పుడు హనుమంతు డిలా చెబుతాడు.

''మనవి చేసెద రామభద్రా - నను - మన్నించు కరుణాసముద్ర
గనుడంగ దుండాదికపులా తోనే పోయి వనజ చెంతకు చేరిన
వగచి యుంటిని రామ
సంపాతి అనే పక్షిరాజు - దాన్ని - సహ్మాద మెల్లగను తేజ
సొంపుములలర
నట్టి అశోకవనములో తెలుపు చేసియు సీతదేవి గలదని తెలిసే
గిరిమీద కెక్కితి స్వామీ - నీదు దరిచన నమ్మితిదే గరుడ వలెనేను
గగన మార్గములోన పడని కష్టము పడి అసురుఃద్దమురాగ
జలవ కాలుపబోలు గట్టుదాన్ని, గిరిమీద పగలెల్ల నిలచి
వనజాక్షుడెరిగిన వేష సమయమునంది వలనొప్పి లంకలో చొచ్చి
యుంటిని నేను
లంకిణి ఎదిరించి నేను - దాన్ని - బింకమున నిలచితి దేవ
లంక లోపల నేను లక్షల వతులాను అందరి నెదిఃంచి చూసుతునైతి
రావణ శృంగారవనము దాన్ని దారి తెలియకపోతేగనుము
కావలి రాక్షసగరితలలో పూలవేలాదీను ద్రెగనిలో సీతానుగంటి
వందన మొనరించి రామా నీదు సందేశములు తెలిపితి నేను
అతి మోదమును జంద
పొందు తెలియంగానె ముద్దుటుంగరమివ సంతోషమున నేను అతి
మోదమును జంద
మంత్రి తనయు లేడ్గురు వచ్చిరీ-నన్ను - మార్గమున నొప్పించిరపుడు
చిత్రశాలికుడైన చక్రాజిత్తనే[39] వాడు బ్రహ్మపోము చేత బంధించి
కట్టియు
కట్టి తీసుకపోయిరామ - నన్ను - దశకంఠుని ముందర నిలపి
గుట్టు తెలియక కొన్ని నిష్టూరంబుల పల్కి దండించి తోకకు
తగిలించి రగ్నియు

లంకాపుర మెల్లను కాల్చి నీదులావు వారికి ఎరుకజేసి శంకలేక నేను
సాగరంబును దాట అలివి తెలియక నేను అగచారము చేసితే.''

## మండోదరి హితబోధ :

హనుమంతుడు లంక నుంచీ తిరిగొచ్చి సీత సందేశమందివ్వగానే.... కపి సైన్యంతో యుద్ధానికి సిద్ధమయ్యాడు రాముడు. నీలుడి సాయంతో వారధి గట్టి అపారమైన సేనావాహినితో లంకపైకి దండెత్తి పోయాడు. ఆ దండును చూసిన మండోదరి గుండె గుభిల్లుమన్నది. అందుకే రాముడి గొప్పతనం తెలుసు కున్న మండోదరి వారి సీతను వారికిచ్చి రాముణ్ని శరణు వేడమని హితబోధ చేస్తుంది. ఈ ఘట్టాన్నే ఒక చెక్క భజన పాట చెబుతుంది.

రావణా భిమనా రావణాధూలు కమ్మినాయ్
రాంబాల మేడ బోయెరా రావణా ॥ రామా ॥
అబ్బ - గుభాలుమనే గుండట్ల జల్లుమనే
దండు వచ్చె మన లంకకు రావణా ॥ రామా ॥
మూడు మూర్ల తోకవాడు మంటి తిరమానివాడూ
ఎల్లి వచ్చె మన లంకకు రావణా ॥ రామా ॥
అర్లుబార్ల తోకవాడు - ఎండీ తిరమాని వాడు
ఎల్లి వచ్చె మన లంకకూ రావణా ॥ రామా ॥

రాత్రి తాను కలలో కన్న దుశ్శకునాల్ని కూడా మండోదరి ఏకరువు పెడుతుంది.

చేతిలోని నల్లగాజులు చెదిరీ రెండొప్పలాయె
చేటు మారికల గంటిరా రావణా ॥ రావణ ॥
కాలిలోటి కంచుమెట్లు చెదిరీ రెండొప్పలాయే
చేటు మారికలా గంటిరో రావణా ॥ రావణ ॥
నొష్టనున్న కుంకం బొట్టు ముగమంత చెదిరిపోయే

చేటు మారికలా గంటిరో రావణా ॥ రావణ ॥

వోరి సీత నోరికిచ్చి వోరికొక్క శరణు చేసి

మెప్పుగా లంకనేలుకో రావణా ॥ రావణ ॥

## విభీషణ వృత్తాంతం :

రామాయణంలో విభీషణుని పాత్ర చాలా విలక్షణమైంది. నైతిక విలువలు, ధర్మనిరతి, సత్య వాకరి ప్పాలన, హరికీర్తనం వంటి ఉత్తమ లక్షణాలు గలవాడు విభీషణుడు. ఇతడు రావణుడికి స్వయాన సోదరుడు. అయినా మొదటి నుంచీ రావణుడి దురాగతాలని విమర్శిస్తూనే వచ్చాడు. ముఖ్యంగా సీతను చెరబట్టడం అతనికి కంటగింపుగానే వుంది. అప్పటికీ రావణుడికి చెవులో ఇల్లు కట్టుకుని చెప్పాడు ఇది అన్యాయమని. కానీ ఆ మూర్ఖుడు వినలేదు. సీతను తెచ్చి తన కొరివితో తన తలనే గొక్కున్నాడు. స్వయం కృతా పరాధం. ఇంక వూరుకుంటే లంక నాశనంకాక తప్పదు. రాముడు సైన్యంతో లంకకువచ్చేసాడు. అందుకే కడసారిగా హితవు చెప్పాడు. ఫలితం అవమానం ... అందుకే అతను రాముడి పక్షంలో చేరిపోయాడు.

అలా అతను రాముడి పక్షం చేరడానికి తగిన కారణాన్ని ఒక చెక్కభజన పాటలో ఎలా చెప్పబడిందో చూడండి

"రాములేను గనెక్కెనన్న రేవుర్దూళ గ్రమ్మెనూ
మేటి రాముల దండు వచ్చి కొలువుసావిడి నిండెను
వారి సీతను వారికిచ్చి వప్పుగ దండములు పెట్టుము
ఎల్లకాలము లంక మనమేల వచ్చు రావణా"

విభీషణుని హితవచనం అతనికి రుచించలేదు.

"పగవాని మాట నాతో చెప్పనొస్తివటరా" అని తమ్ముడని ఎంచకుండ ఎగిరి కాలితో తంతాడు-

''తన్నితే తన్న్యేవుగాని పాదమెంతో నొచ్చెన'' అని పాదాలొత్తు తాడు విబీషణుడు.

దాంతో ఇంకా రెచ్చిపోతాడు రావణుడు.

''తమ్ముడని అంటాకురనను తమ్ముడని ముట్టాకురా....
వీదులనిన్ యాడచూసిన వీబెలతో క్రుమ్మింతుర
రచ్చలసిన్ యాడజూచిన రాళ్ళతో కొట్టిస్తురా
నీను చర్మము దీతురా - రథ (ణ) బేరికే మూపింతురా
పంటిరెట్టకు పగ్గమేసి బండ్లకేడదీతురా .. ''

అని దంబాలు పలుకుతాడు. దాంతో అవమానం భరించలేక విబీషణుడు తల్లికి మొరపెట్టుకుంటాడు.

''ఎందుకమ్మా నా బ్రతుకు హీనమాయెను కులములో
ఈనమాయేను కులములో అవమానమాయెను జాతిలో''

## లక్ష్మణ మూర్ఛ :

రావణుడి మూర్ఖత్వంతో రామరావణ యుద్ధం అనివార్యమైపోతుంది. కపి సైన్యం ఒక వైపు రాక్షస సైన్యం మరొక వైపు తలపడతారు.

ఇరుపక్షాల వారికి ఘోరంగా రణం సాగుతోంది. అతికాయుడులాంటి వారు మట్టి కరిచారు. కుంభకర్ణుడు సైతం నెలకొరిగాడు...దాంతో గత్యంతరం లేక రావణ పుత్రుడు ఇంద్రజిత్తు బరిలో దిగాడు. జిత్తులమారి ఇంద్రజిత్తుతో లక్ష్మణుడు తలపడ్డాడు. ఇద్దరూ తమ తమ ప్రతాపాలు చూపుకున్నారు. అయినా ఎవ్వరూ ఓడనూ లేదు గెలువనూ లేదు. ఇలా మామూలుగా సౌమిత్రిని గెలవ లేమని మాయా యుద్ధానికి దిగాడా ఇంద్రజిత్తు. మేఘాల్లో దాగి యుద్ధం చేశాడు. ఫలితంగా లక్ష్మణుడు మూర్ఛ చెందాడు. మూర్ఛపోయిన తమ్ముడ్ని చూసి రాముడు గుండె చెరువయ్యేలా విలపిస్తాడు

"దశరాధరాజు గర్భమున జన్మించియు ఏమి అనబోగిస్తిమి[40]
తమ్ముడ మనము

ఈడుజోడుగ నీవు యిద్దరు మొస్తిమి విడనాడి వడి పోతివా
తమ్ముడ నీవు

వదిన కోసము నీవు వారాది బంధించి వదిన వనము చేరిన తమ్ముడ
నీవు

మేగములో నడయాడే యింద్రజిత్తు నేవాడు మూర్చ బాణము
వేసేన తమ్ముడు నీపై

దినదినమున నొచుట దిద్దిన తిరుమణి దివ్యరత్నము తమ్ముడా
లక్ష్మణ యోరీ

సీతంటి స్త్రీలను లక్షలకునే తెత్తు నీ వంటి తమ్మునీ
ఏ జన్మమున జూతు

పగవారి బాణాలు పైబడి వస్తయి పలుక వేమిరతమ్ముడా లక్ష్మణసామి
పాల వర్ణమువంటినీ యొక్క పలువరుస ఏ జన్మమున జూతునో
లక్ష్మణ సామీ

పగవాని చేధరణీ పడితివ లక్ష్మణ బ్రహ్మనీకిటు వ్రాసేనా తమ్ముడ
నీ వంటి తమ్మునీ నేనెందు కనుగొందు దేవ దేవుడు వారి త్రోవ
చూపిననాడు

పుట్టినప్పుడు తల్లి పెట్టింటె మనకినము[41] యిట్టి కష్టము మనకు
ఏలకలుగునయ్యా

రాజ్యమెందుకు నాకు రణము నా కెందుకు గుణము కలిగిచట్టి
భార్య నాకెందుకు."

ఎంత ఏడ్చినా మూర్ఛనుండి తేరుకోలేదుకదా లక్ష్మణుడు. అందుకే కపివైద్యుడు జాంబవంతుడు సంజీవిమూలిక పొద్దుపుట్టేలోపు తెచ్చివ్వమంటాడు.

అది హిమాలయ పర్వతాల్లో ఉంటుంది. అందరూ హనుమంతుడు దానికి తగిన వాడంటారు. కానీ ఆ మూలికెలాంటిదో హనుమంతుడికి లేలీదు. అందుకే రాముడు జాంబవంతున్ని తీసుకుని పొద్దువ్పొట్టేలోపు తిరిగి రమ్మని పురమాయిస్తాడు. ఇదీ ఒక చెక్క భజన పాటే.

''సంజీవికే వెళ్ళుమా శ్రీ హనుమంత ద్రోణాద్రికే చేరుమా
ఇచటికి ద్రోణాద్రి యిలనూరు ఆమడ అరవై ఐదామడ
పొడవు కలిగుండు,
జాంబవంతునితోడ చక్కగ నీవు పోయి తిరుగుతు వున్నట్టె
పరుగున రావయ్యా.
పద్య త్రోవలయందు మాయారాక్షసులుండు మాయలు కల్పించి
మరణింప జేతురు.''

ఇక సంజీవి ఎలా వుంటుందో కూడా చెబుతాడు.

''పండ్లు పచ్చగవుండు పగలు రాత్రులయందు తెల్లటి ఆకులు తేటుగ
వుండు
ఎర్రని ఆకులు ఏర్పాటుగా వుండు అన్ని మందులు గలవు
అమృతము గలదయ్య గందర్వల చోటట కావాలివుందురు.''

ఆలాగే ఆ సంజీవిని సూర్యోదయంలోపలే ఎందుకు తేవాలో కూడా
చెబుతాడు.

''పొద్దుమొలయక మునుపె తెస్తేనే సంజీవి నా ముద్దు తమ్ముడు
మూర్ఛ మండి లేసును.
సూర్య వంశపురాజు సుతులము మేమయ్య సూర్యుడు ఉదయిస్తే
జీవింప జాలము.

ఇది లక్ష్మణ మూర్ఛ.

అయినా లక్షణుడు మూర్ఛ చెందడానికి జానపదులు ఒక చక్కటి కధను కల్పించారు.

రాముడు ఆరణ్యవాసం చేస్తున్న సమయంలో శబరి ఆశ్రమానికి వెలతాడు. అతని కోసమే ఎదురు చూస్తున్న రామ భక్తురాలయిన శబరి ఆతనికి అతిథ్య మిస్తుంది. కొన్ని ఫలాలు తీసుకుని బాగున్నాయా లేవా అని కొరికి ముందు తను రుచి చూసి, ఆరుచి చూసిన పళ్ళనే రామలక్ష్మణులకు నైవేద్యంగా పెడుతుంది. భక్తసులభుడైన రాముడువాటిని ఎంతో ఆప్యాయంగా తింటాడు. కానీ లక్ష్మణుడు వాటిని తినడు, దానికి కారణం వేరొకటి వుంది.

లక్ష్మణుడు పూర్వజన్మలో నాగేంద్రుడనీ... అతన్ని అవమానించి కూతురయిన సులోచనను రావణ పుత్రుడైన ఇంద్రజిత్తు తీసుకువెలతాడనీ కథ. తన్ను అవమానించిన ఇంద్రజిత్తును చంపుతానని ప్రతిన చేస్తాడు నాగేంద్రుడు.14 ఏళ్ళు నిద్రా హారాలు మానివేసిపెళ్ళి చేసుకున్నా, బ్రహ్మచర్యం పాటించినవాడే తన్ను చంపుతాడనీ అది నీ వల్లా కాదని ఇంద్రజిత్తు చెబుతాడు. అందు కోసమే మరుజన్మలో లక్ష్మణుడై పుట్టి ఊర్మిళను పెళ్ళి చేసుకుని తన నిద్రను ఆమెకిచ్చి అన్నతోబాటు అడవికి బయలుదేరుతాడు.

ఆలా ఆహారాన్ని కూడా త్యజించాడు కాబట్టే శబరి ఇచ్చిన పళ్ళు తినడు. వాటిని విసరి పారవేస్తాడు.

అసలు విషయం తెలియని శబరి, అపళ్ళనుంచీ పుట్టిన కొమ్మ ఆకులే నీ ప్రాణాల్ని రక్షిస్తాయి పో అని శపించినట్లు చెప్పుకుంటారు. ఆలా లక్ష్మణుడు మూర్ఛ పోయిన సమయంలో హనుమంతుడు తెచ్చిన సంజీవి మూలిక ఆ పళ్ళ మొలకలేనని చెబుతారు.

కానీ శబరి యిచ్చిన పళ్ళను లక్ష్మణుడు తన తొడ చీల్చి ... అందులో ఉంచుకున్నాడని మరొక కథనం, ఇది పూర్తిగా అవాల్మీకం.

## రామ రావణ యుద్ధం :

యుద ఘట్టాల్ని చిత్రీకరించిన జానపద గేయాలు చాలా తక్కువ. ముఖ్యంగా రామాయణ యుద్ధ ఘట్టాన్ని తెలిపే గేయాలు మృగ్యమేనని చెప్పాలి.

ఒక కలుపుపాటలో జానపద స్త్రీలు రామరావణ యుద్ధ ఘట్టాన్ని ఎంతో హృద్యంగా మనోహరంగా కళ్ళకు కట్టినట్లు చిత్రించారు,

''మనముచ్చటారాన యుద్దం చేకానీ
ఆనాడు యిచ్చిన అమృత ఫలములు ఏవి
ఆని అన్న అడుగగ అపుడు లక్ష్మణుడు....
హనుమంత లక్ష్మణ మీరిద్దరివుడు ....
అనునుంత భుజమెక్కి అపుడు లక్ష్మణుడు
ఇంద్రజిత్తునకేమొ కానపడకుంచా
మేగమండలమును లక్ష్మణుడప్పుడు
మేగమండ్లవల కొట్టగానే యింద్రజిత్తు ...
ఇంద్రజిత్తుడు కూలెనాని రావణునికి చెల్పి
కొండ్ల కొమ్మల యందు పండ్లు తినే కోతి
నాచేతిలో నీవు చిక్కిపో ..
రామ బాణము వదలగానే అతి కాయుడపుడు ...
అతి కాయుడు కూలెనాని రావణునికి చెల్పి ....
ఏనుగులు గుర్రాలు తెప్పించిరపుడు
నూని కొలాయిలు కావించిరపుడు
కదులుచు మొదలుచు కుంభకర్ణుడు ....
ఏ తట్టు చూచినా దండులే కానీ
వానరులందరిని పట్టుకొని వాడు
అట్టు వాళ్ళను మింగగానే వానరులపుడు ....
రామ బాణమునపుడు సంధించెనయ్య
మరి ఒకటి లేదుర అయ్యో లక్ష్మణా....
చూపు తమ్ముడ అయ్యో లక్ష్మణా...
తన తొడలు చీల్చి యా ఫలములు చూపే

యింద్రజిత్తుని మారు కూల్చి వచ్చెదరా
మేగమండలములో వారు నిలిచిరీ
అనుమంతుడే మోను అడ్డమువచ్చె
వక్క దెబ్బతోనే చెదర గొట్టెను
ధరణిపై కూలెను యింద్రజిత్తుడు
అతికాయునప్పుడు యుద్దాని కంపె....
విషమెక్కి నా పైకి నీవు వచ్చితివా
రామబాణము అపుడు సంధించెనయ్యా
ధరణీపై కూలెను అతికాయుడపుడు
కుంభకర్ణుని మీరు నిద్రలేపండి
కుంభ కర్ణుని మీద త్రొక్కించినారు
కుంభకర్ణుని చెవిలో త్రిప్పించినారు
కదలుచు మెదలుచు పైకిలేసేనూ
రామ రామ అని శబ్దమొచ్చెనూ....
గుటుక్కన ఏమొ తాంగేశనయ్యా
చెవులలోపలకుండ బయట కొచ్చిందీ
రామబాణమునపుడు సంధించెనయ్యా
ధరణీపై కూలెను కుంభకర్ణుడు[42]

ఇలా అతికాయుడు, కుంభకర్ణుడు మరణించగానే విభీషణుడు రావణుడి దగ్గరికి వెళ్ళి...ఇప్పటికైనా యుద్ధం విరమించమనీ వారి సీతను వారికిచ్చి శరణు వేడమని రాయబారం నెరపుతాడు.

"కుంభకర్ణుడు కూలెనావి విభీషణుడైతే
అన్న వద్దకు యేమొ పరుగూన పోయే
విను మున్నపాన విన్న వించెదను
మన లంక వార్తలు గనముగ నీకు

యమధర్మ నాయకులందరు కూడి
మన లంక కేమొను చేటు కలిగేను
మన యింట పుట్టెను శ్రీ లక్ష్మి దేవి
చెల్లెలుగా నీవు భావించుమన్న
శ్రీరాముల భార్యను శ్రీరాములకిచ్చి
చల్లగ దీవించి ఆయోధ్యకంపు
పరగ కంభము పాటు కోదండరామా
మమ్ముల కాపాడు సకలము రామ___''

## తిరిగొచ్చిన సీతారాములకు జయ మంగళం :

రాక్షస సంహారం చేసి తండ్రికిచ్చిన మాట ప్రకారం అరణ్యవాసం చేసి సీతాసోదర సమేతంగా వానర సేనలతో శ్రీరామ చంద్రుడు అలాగే అయోధ్యకు తిరిగొచ్చాడు. అయోధ్యవాసుల ఆనందానికి అవధులు లేక పోయాయి. ఇంటింట మంగళారతు లెత్తారు.... ఆ తని చరిత్రం వేనోళ్ళ గానం చేశారు. గుండె నిండా రామ భక్తిని నింపుకొని నోరారా రామకీర్తిని కీర్తించి పరవశించిపోయారు.

''సుగ్రీవరాముని వినుతా జయసీత పరిపాలన నిత్య మంగళము
నీ నామరూపముకు నిత్య జయమంగళము నీకు శుభమంగళము
ఆంజనేయ వరదనికు హారతిదుగో మంగళము
ప్రహ్లాద వరదునికి ప్రేమతో ముత్యాల వనమున రత్నవర్షము
కురిసే ॥ మంగ ॥

కొమ్మకోలువాయి కోటి కోతి వానరులాకు
హారతిదుగో మంగళారతిదుగో....
రాముడొస్తున్నాడు రామాంభజే...
మన దేవుడొస్తున్నాడు రామాంభజే
ముత్యాల పాలకీలో రాముడొస్తున్నాడో

రత్నాల పాలకీలో దేవుడొస్తున్నాడు
పగడాల పాలకీలో రాముడొస్తున్నాడో
హారతిదుగో మంగళారతిదుగో
మంగాళమొ జయమంగాళమొ
మా తం(డి రాములాతు మంగాళమో
జనకుని కూతురకు మంగాళమో
దశరధ కోడలకు మంగళమో
భూదేవి కూతురుకు మంగాళామో
సీతమ్మ తల్లికి మంగాళమో జయ మంగాళమో
కర్పూరంబు హారతి బంగారు గో(సపల్లెరమున
ఎప్పుడోల వేళనో సోమశైల వానుడికి హారతిదుగో
మంగళారతిదుగో మంగాళమో''

## రామాంజనేయు యుద్ధం :

భారతంలో కృష్ణార్జునులకు యుద్ధం జరుగుతుంది. దానికి కారణం గయుడు దీన్నే గయోపాఖ్యానం అంటారు. రామాయణ కథకు సంబంధించి కూడా అలాంటి యుద్ధమే రామాంజనేయులకు జరుగుతుంది. దీనికి కారణం యయాతి.

యయాతి మూలంగా రాముడితో యుద్ధం సంభవించినందుకు ఆంజనేయుడు ఎంతో తల్లడిల్లిపోతాడు. అలాగని యయాతికిచ్చిన మాటను వెనక్కి తీసుకోలేడు. రామాంజనేయుల మధ్య యుద్ధం అనివార్యమైపోతుంది. యుద్ధభూమిలో.... హనుమంతుడు తన రొమ్ము చీల్చి అందులో సీతారాముల్ని చూపించి తన అకలంకమైన రామభక్తిని చాటుకుంటాడు. దాంతో యుద్ధం ఆగిపోతుంది. ఇంతకంటే వివరంగా చెప్పడం ఇక్కడ అప్రస్తుతమవుతుంది.

ఈ ఘట్టాన్ని చాటి చెప్పే గేయాలు చాలా అరుదు. అలాంటి అరుదయిన ఒక చెక్కభజన పాట తిలకించండి.

"శతయోజనంబయిన జలనిధిలంకించె వెలగిలంకాపురికి చేరితివయ్యా
వాలంబున అగ్నిజ్వాలలు ముట్టించి కనకాద్రియగులంక కాల్చితివయ్యా
తనవేణిచే ప్రాణము తీసుకొనువేళ సీతకు శుభవార్త తెల్పితి నేను
వనధిపై బాటగ వారిధి గట్టించి మించితత్పురాన్నపుడు ముట్టడించితివి
నూరుయోజనముల వారిధి దాటి, దాటిపోయినట్టి ఆంజనేయుడను

లంకిణి పరిమార్చి లంకాపురమును అగ్నిపాలు చేసిన వాయునందనుడను
సౌమిత్రి మూర్ఛిల్లం సంజీవిదెచ్చి ప్రాణంబునిచ్చిన రామబంటును
హరుణోదయంబున మైరావణునిగెల్చి రామలక్ష్మణులేలు రామబంటును
నామీద దయలేక రామచంద్ర కపిగట్టి[43] నాపైకి నీవు వచ్చితివో
రామరామ అని మదిలోన దలచి వక్షస్థలమపుడు చీల్చినాడయ్యా
వక్షస్థలమందున రామలక్ష్మణుల కనులార చూచె రఘురామచంద్ర
రాములు బాణము ధరణిపై వేసి వాయుపుత్రున్నపుడు కౌగలించెను"

## సీతా ఊర్మిళ సంవాదం :

వాల్మీకి రామాయణంలో ప్రాముఖ్యతను కోల్పోయిన ప్రధాన పాత్రలు కొన్ని వున్నాయి. అవి శత్రుఘ్నుడు, ఊర్మిళ, శ్రుతకీర్తి, మాండవి. వాల్మీకి ఈ పాత్రల్ని పూర్తిగా విస్మరించాడు. కానీ జానపదులు ఊర్మిళ విషయంలో ఆ లోటు తీర్చారు.

సీతతో బాటుగా ఊర్మిళ కూడా వనవాసానికి వెళ్ళి వుండే కథ మరోలా వుండేది. లక్ష్మణుడు ఆమెను వద్దన్నాడు. భర్త మాటకు కట్టుబడి ఆమె యింటనే వుండి పోయింది. రామలక్ష్మణుల వనవాసకాల పర్యంతమూ....పదునాలుగేండ్ల పాటు ఆమె దీర్ఘనిద్రలో మునిగిపోయింది.

ఈ అంశాన్ని చాలామంది పరిశోధకులు తమ గ్రంథాల్లో అన్నిసేయాలతో బాటు చెప్పుకున్నారు. అట్టివారిలో బి, రామరాజు గారు నేదునూరి గంగాధరం ముఖ్యులు.

సీతకు ఊర్మిళ, మాళవి, శ్రుతకీర్తి అనే ముగ్గురు చెల్లెళ్ళున్నారు, ఆ ముగ్గుర్ని లక్ష్మణ భరత శత్రుఘ్నులు వివాహ మాడారు.

సీతారాములు వనవాసం వెళితే, ఊర్మిళ తన భర్త నిద్రను కూడా తానే తీసుకొని....వారి వనవాసం పూర్తయి తిరిగి వచ్చేంతవరకు నిద్రపోతూనే వుంటుంది. ఈ ఊర్మిళ నిద్రను గురించిన జానపద గేయాలెన్నో వున్నాయి.

సీతారాములు వనవాసం వెళ్ళి తిరిగి వచ్చిన తర్వాత సీత రాముడు తనను పెట్టిన పరీక్షల గురించి ఊర్మిళకు చేబుతుంది. లంకలో నుండీ వచ్చిన సీతను రాముడు శీల పరీక్ష కోరుతాడు. దానికి సీత అగ్ని ప్రవేశం చేసి తన శీలాన్ని నిరూపించుకుంటుంది. ఇది అన్ని రామాయణాల్లోనూ ఉన్న అంశమే. అయితే జానపద రామాయణంలో మాత్రం సీతకు అగ్ని పరీక్షతో బాటుగా యింకా ఎన్నో విచిత్రమైన పరీక్షలు పెడతారు. అయినా అసాధ్యమైన ఆ పరీక్షల నన్నింటినీ సీత సుసాధ్యం చేస్తుంది,

ఒక మడిపాటలో తనకు రాముడు పెట్టిన పరీక్షలు, తను వాటిని నెగ్గుకొచ్చిన వైనం హృదయ రంజకంగా చెల్లెలికి చెబుతుంది సీత.

''ఇనవమ్మ ఊర్మిళా నా ముద్దు చెల్లెలా
ఇమర మొక్క వార్త తెలిపేవా
హెచ్చుకను గొన్య రామలక్ష్మణులెల్ల ఎచ్చుగా చేసీరీసవాస
ఏడు ఏండ్లనాడు ఎండిన
గజ నిమ్మపండ్లు తెమ్మన్నాడు మీ బావ
ఆయిష్టు వాల్మీకి మునులెల్ల సూడాక
పండ్లు తీసకొస్తి నీ తోడ ॥ ఇన ॥
రాతి ఆవును జేసి మట్టి దూడను ఇడిసి
పాలు దెమ్మన్నాడే మీ బావ

అయిష్ట వాల్మీకి మునులెల్ల సూడాక
పాలు తీసకొస్తి సీ తోవ ॥ [illegible] ॥
ఏడు ఏండ్లనాడు ఎండిన పాలదావి
నీళ్ళు తెమ్మనావే ఓ దావ
ఆ యిష్ట వాల్మీకి మునులెల్ల సూడంగ
ఆ నీళ్ళు తీసకొస్తి సీ తోవా
కట్టించే నలప సీరా పెట్టించే సొమ్ములు
పెదరకుండా అగ్గి తెమ్మన్నావే ఓ దావ
ఆ యిష్ట వాల్మీకి మునులెల్ల సూడంగ
అగ్గి తీసకవస్తి సీ తోవా ॥ [illegible] ॥

ఏడుబండ్లా కట్టెగుండానికి ముట్టి
ఎల్లి రమ్మన్నావే ఓ దావ
ఆ యిష్ట వాల్మీకి మునులెల్ల సూడంగ
అగ్గి దూకి వస్తి సీతోవ .. అగ్గి తీసకొస్తి సీతోవ ॥ [illegible] ॥

## చాకలి వృత్తాంతం :

ఈ క్రింది కోలాట పాటలో సీతారాముల దాంపత్యమైన [illegible] బాటలు వేసిన చాకలి వృత్తాంతం చెప్పబడింది. తన పైన పడ్డ [illegible] కోడానికి నిండు చూలాలయిన సీతను రాముడు అడవులకు పంపించిన వృత్తాంతం వర్ణింప పడింది,

" శరణు శరణు రామయ్యా
శరణయ్య రాఘవా .... లవ కుమారా కుశ రామరాజ కుమారా ॥శరణు॥
శరణన్న వారికే గండంబులేదురా ....
ఆయవేద్య[45] పట్నాన - సింతగొడుగుల కింద
రాములే కొలువాయ ॥శరణు॥

శుక్కురవారము నాడు సక్కన్ని దినములే
ఆయివేద్య పట్నాన నోములొ పండుగలే ॥శరణు॥
సాకలీ సెంగడే ఆమైలు గుడ్డాలే
పెదమూటలే గట్టి ఈ దికేఎల్లేసె
పెదమూటల్ గట్టే ఎత్తినే ఏనిక్కు[46] ॥శరణు॥
వానిద్ర పెండ్లాలకు సాకిరేవుకి వోయేటి
సక్కన్ని దోవలో వాదు కొట్లాటలే ॥శరణు॥
సాకలీ సెంగడే గుడ్లెర్ర జేసి
వాన్పెద్ద పెండ్లాన్ని వక దెబ్బగొట్టెనే
అలిగివోయి యాగాద [47] పుట్నిల్లెజేరనే ॥శరణు॥
ఏమిరా ఓరబ్బ సాకలా సెంగన్నా కూడు గుడ్డావేసి కుదుటబెట్టుకోరా
గడపెల్లిన దాన్ని కన్నెత్తి సూడనే ఇల్లూలేని దాన్ని వల్లేది లేదు [48]
అలిగి వోయిన గాదను సెరిదెచ్చుకోనూ
నాకు సెల్లదు గానీ రాములకు సెల్లునూ[49] ॥శరణు॥

## అమీని కొండాన సీతమ్మ లాలి :

ఉత్తరి రామాయాణంలో.... గర్భవతి అయిన సీతను.... అమిని ప్రాంతంలో వదిలేసి లక్ష్మణుడు వెళ్ళినట్లు ఆ ప్రాంతం ప్రజలు భావిస్తారు. ఇది పూర్వకాలంలో దండకారణ్యంగా ఉండేదనీ .. అమిని ప్రాతంలో వసిష్ఠుని ఆశ్రమం ఉండేదని భావించబడుతోంది. ఈ అమిని అనంతపురం జిల్లాలోవుంది.

ఈ అమిని కొండన కామిని గుంటి పక్కన సీతమ్మ లవకుశుల్నికన్నది. అక్కడే లవకుశులు పెరిగి పెద్ద వాళ్ళయ్యారు. ఆ సమయంలో బాల లవకుశులు ఏడిస్తే.... వారిని ఊయలలో వేసిఊపుతూ ఊయల పాట పాడినట్లుగా జానపదులు పాటలు పాడుకుంటారు ఈ రకం పాటలన్నీ అనంతపురం జిల్లాలో పాడుకోవడం గమనార్హం.

కోలాటంలో పాడే ఈ పాటలో వారి పినతండ్రి లక్ష్మణుడు ప్రేమతో చేసిన ఊయలతొట్టి, పినతల్లి పాలగిన్నెలు, పాలాడి, తాత దశరథుడు బంగారు తెచ్చినట్లుగా గానం చేయబడ్డది.

లాలీలా అమ్మాలాలీ లాలమ్మ లాలి
ఆమీనా కొండానా సీతమ్మ లాలి ॥ లాలి ॥
అమీనీ కొండాన అల్లానేరేడు
అలానేరేడి కాడా సీతా జలకమూలు ॥ లాలి ॥
ఆమీనా కొండానా కామీనా గుంటు
కామీనా గుంటి కాడా సీత సీల్లాదేలు ॥ లాలి ॥
పినతండ్రీ లచ్చానా ఏమిచ్చా మీకు
పినతండ్రీ లచ్చానా ప్రేమ తీగేలే పెచ్చా
ప్రేమాతీగాలు దెచ్చా తొట్లీ గావించా
తొట్టుల్లో బాలున్ని ఇగబందాపెట్టే ॥ లాలి ॥
పినతల్లీ ఊర్మీళా నీకేమిదెచ్చా
పినతల్లీ ఊర్మీళా పాలాగిన్నెలు పెచ్చా ॥ లాలి ॥
ఏడవకు ఏడవకూ ఎర్రీ లవ్వన్నా
ఏడిస్తే నిన్నెవరూ ఎత్తూకుందేరు ॥ లాలి ॥
ఇరుగెవురూ పొరుగెవ్వారూ ఇవ్వారించేటాలి
పొరుగెవ్వారుండంగా పోరూ మాన్పించేరూ ॥ లాలి ॥
ఈ అడవుల్లో రాల్లాపేటుల్లో
రాల్లే బందుగులూ సెల్లే చుట్టాలు
అగ్గినీ దేవుల్ల అయనే బందుగుడూ ॥ లాలి ॥

పైపాటలో రాల్లే బంధువులు, చెల్లే చుట్టాలుగా చెప్పడం సీత యొక్క అసహాయతను చాటి చెబుతున్నది. అంతేగాక 'అగ్గి నీ దేవుడు' బంధువని చెప్పడంలో....సీత శీల పరీక్షకు అగ్నిలో దూకిన సన్నివేశాన్ని తలపింప చేస్తోంది.

ఇదే అంశం మరో కలుపుపాటలో ఏవిధంగా చిత్రీకరించబడిందో చూడండి. ఈ గేయం కడపజిల్లాలో ప్రచారంలో వుంది.

"ఆ రెండ పడవిలో ఆ పర్ణశాలలో ఆపర్ణశాలలో
దేవుడు మన తండ్రోయ్ తులసీదేవీ మా తల్లోయ్
శ్రీరామా మాయన్నా సీతా మా వదినా
రఘురామామయన్నా తులసీరంభా మా వదినా
ఉండేది కొండాపైనా బండా పేటునా
సెల్లే చుట్టాలోయ్ తొలసీరాల్లే పందిల్లోయ్
ఏడిస్తే విన్నెవరూ ఎత్తుకుండేరు
ఇరుగెవ్వరొచ్చేరు తొలసీ ఘోరూమాన్నేరు
కనుకొండే సీతమ్మ కొసెరాకొడుకులా[32]
ఏడవకూ లవ్వన్నా తొలసీ ఏడవకూ కుశలన్నా
పినతండ్రీ లచ్చామన్నా నిను చూడవచ్చీ ఏమేమి దెచ్చా
ఉగ్గు గిన్నెలు దెచ్చా తొలసీ ఉయ్యాలెదెచ్చా
పాలగిన్నెలు దెచ్చా తొలసీ పాలగిన్నెలే దెచ్చా
ఏడవకో లవ్వన్నా ఏడవకో కుశలన్నా"...

## ఆమెనిలో సీత అంతర్ధానం :

ఉత్తర రామాయణంలో లవకుశుల చరిత్ర ప్రధానంగా ఉంటుంది. రాముడు అశ్వమేధయాగం చేస్తాడు. ఆ యాగాశ్వాన్ని లవకుశులు బంధిస్తారు. అంపుకల్లా రామసోదరులతోను రాముడితోను లవకుశులు యుద్ధం చేస్తారు,

ఈ విషయం తెలిసి ఆ యుద్ధాన్ని ఆపడానికి సీత అక్కడికి వచ్చి రామున్ని గుర్తిస్తుంది రాముడు సీతను గుర్తిస్తాడు అక్కడే సీత తన తల్లి అయిన ధరణి భూగర్భంలోకి విలీనమైపోతుంది,

అయితే అక్కడా సీతకు రాముడు అనేక శీల పరీక్షలు పెట్టినట్లు జానపదులు కల్పించు కున్నారు, రాముడి గురించి, రామాయణం గురించి ఎంత ఎక్కువగా పాటలు కట్టి పాడుకున్నా జానపదులు రాముడి అనుమానపు మనస్తత్వాన్ని మాత్రం వదలలేదు. వీరి దృష్టిలో సీతపై మన్న రాముడి అనుమానం అంతా ఇంతా కాదు.

ఈ క్రింది మడి పాటలో రాముడు సీతను అనేక కఠిన పరీక్షలకు గురి చేయడం ఆమె వాటినన్నింటిని నిరూపించడం లక్ష్మణుడు ఆమె పాతివ్రత్యాన్ని కొనియాడడం జరుగుతుంది. ఇదే పాటలో చివర సీత భూమిలోకి అంతర్ధానమై పోయే ఘట్టం కూడా వుంది.

లక్ష్మణ : పట్టాభిరాముడు పెండ్లి ఆడినది మొదలూ
మా దేవి సీతాకే వచ్చే కష్టములూ
చూస్తివంట్రా రోరన్న మా వదిన సత్యమూ

రాముడు : చూడలేదు లచ్చునా వారి సత్తె బాన

లక్ష్మణ : ఇక నేమీ కోరేవూ ఈరావతారుడా
ఇక నన్నిటు మీద ఇవ గ్యేనములు
ఇద్దరూ బాలల సంక బెట్టుకోనీ
అమినీ కొండానా కామీనీ గుంటికాడా
ఇద్దరూ బాలల సంక బెట్టుకోనీ
గుండు దూరీ వచ్చా మా దేవి సీతా
చూస్తివంట్రావోరన్నా మా వదిన సత్తెములు

రాముడు : చూడలేదు లచ్చునా వారిసత్తెభాస

లక్ష్మణ : ఇకనేమి గోరేవు ఈరాహవతారుడా
ఇక నన్నిటు మీద ఇవగ్యేనములు[53]

రాముడు : ఏనుగుల మూరేటి ఇనుపజ ల్లెడలోనా
పొట్టు నేల పడకుండా నీళ్ళెత్త కొస్తేనూ
అప్పటికేమన్నా సూతాములేరా
పోయనే సీతమ్మ బంగారు కోనేటికీ
మునిగి మునిగి సీతా సానములు జేసెనూ
తడి బట్టలతోనా పిడి గంటలతోనా
దండొక్క పొద్దులతో ...
ఏనిగల మూరేటి ఇనుప జల్లెడతోనా
చుక్క నేల బడకుండా నీళ్ళెత్తు కోవొచ్చి
రఘురాములెదుట నిలచేనూ

లక్ష్మణ : చూస్తివంట ఓరన్నా మా వదిన సత్తెములు

రాముడు : ఇకనేమి కోరేవు వీరహావతారుడా
ఇకనన్నిటు మీద ఇవగ్యేనముల

రాముడు : రాతి యావును చేసి మలప దూడను జేసి
అరిసేత పాలు పిండి మోచేత చిలకొట్టి ఎంటికతో ఎన్న తీస్తే
అప్పటికేమోనో సూతాములేరా....
పోయనే సీతమ్మ బంగారు కోనేటికీ
మునిగి మునిగి సీతా స్థానమే జేసా
తడి గోకల తోనా పిడి గంటలతోనా
దండొక్క పొద్దూతో గుంటి కాడికి వచ్చె
మనవి చేతుల బట్టి మనిమికే నిలిచా
ఏదుమ్మ సాంమాని గుంటీకి బట్టా
చెమ్మతో ఉదకాలూ రాతికే చల్లానే
నాలోన సత్తెముంటే రాయియావుకావలె
రాతి యావులు యామనుషు దూడాల లేశా

అరిసెత్కాపాలు పిండి మోచేత చిలకొట్టా
ఎంటికతో ఎన్నదీశా మహాదేవి సీతా
దూడయావులు ముందు సీతమ్మ ఎనకా
వచ్చి రఘురాముల ఎదటనే నిలిచా
మనిమి చేతులు బట్టి మనిమికేనిలిచానే

లక్ష్మణా : చూస్తి వం(ట్రో(ర)న్నా మా వదినా సత్తెములు

రాముడు : చూడలేదు లాచ్చనా వలసత్తె(బాస

లక్ష్మణా : ఏమేమి కోరేవూ శ్రీరామావతారుడా
ఇకన్నన్నిటు మీద లేవజ్ఞానములు

రాముడు : ఏడు ఏండ్లనాడు ఎండిన గజనిమ్మ
కాయలతో పిందెలతో నా కదిలివస్తేనా
అప్పటికే మన్నా నూతాములేరా
పోయనే సీతమ్మ బంగారు కోనేటికీ
మునిగి మునిగి సీత స్నానములే చేశా
తడి కోకలతో పిడిగంటలతోనా
దండోక్క పొద్దుతో చెమ్మతో ఉదకాలే
తెచ్చేనే సీతమ్మ మానీ కాడి కొచ్చా
మనిమి చేతులు బట్టి మనిమికే నిలిచే
చెమ్మతో ఉదకాలూమానికే చల్లానే
సేతనే వైరాలు [54] మానికేబట్టా
ఏదూను స్వామాని ఏకదూమామే యేసె దేవీసీతా
ఏడు ఏండ్లనాడు ఎండిన గజనిమ్మ నాలో సత్తెముంటే
కాయలతో పండులతో కదలాలసిందే
కలకాల ఇగురేశా పలపాల పిందేసే
కాయలతో పిందెలతో కదిలెనే గజనిమ్మ

గజనిమ్మ ముందేమో సీతమ్మ ఎనకేమొ
వచ్చి రఘురాముల ఎదటనే నిలిచా

లక్ష్మణ : చూస్తి వంట్రోరన్నా మా వదిన సత్తెషులు

రాముడు : చూడలేదు తొచ్చనా వల సత్తెబాస

లక్ష్మణ : ఏమేమి కోరేవు ఈరాహవతారుడా
ఇకనన్న ఇటు మీదలేవగ్యానములూ

రాముడు : పదునాల్గు ఏండ్లాయనా తలిదండ్రులు జచ్చీ
వాళ్ళలేపకొస్తేనూ అప్పటికీ సూతాములేరా
పోయనే సీతమ్మ బంగారు కోనేటికీ
మునిగి మునిగి సీతా స్థానములేజేశా
తడికోకలతోనా పిడి గంటలతోనా
సెమ్మూతో ఉదకాలు చేతవైరాలు
అత్తమామల గోరీల కాడికొచ్చా
అలికి పూసీ సీతా పులకాపనా జేశా55
చెమ్మూతో ఉదకాలూ గోరీపై జల్లెమాదేవి సీతా
సేతనే వైరాలూ ఏదుమ్మ స్నానాని ఏకదూపమ్ము యేసేను
దేవిసీతా

మామ దశరథుకు, ఘాయత్త కవుసల్య
పెద్దత్త సౌమిత్రి-మామ దశరథుడూ
నాలోని సత్తెముంటే లేవాలసిందే
వాళ్ళ మామ దశరథుడూ ముగ్గురత్త వారే
లేచి కూచున్నారే అప్పుడయినానూ
అత్త మామల ముందు సీతమ్మ ఎనుకేనూ
పచ్చి రఘురాముల ఎదుటనే నిలిచా

లక్ష్మణ : చూస్తి వారోరన్నా మావదినా సత్తెములూ

రాముడు : వొప్పలేదు లాచ్చనా వలసత్తె బాస

లక్ష్మణ : ఇకనైన లేవగ్యానములు
ఇకనేమి కోరేవు ఈరాహవతార.

ఇలా అలవి కాని పరీక్షలకు రాముడు తనను గురి చేస్తుంటే చివరికి విసుగు చెందిన సీత తన తల్లి ధరణిని తనలో కలుపుకోమని వేడుకుంటుంది.

"ఆమీనా కొండానా చట్టు బండానా
ఆకాశ వేణమ్మ భూదేవి మాతల్లి
నువ్వన్న కొంచేము చోటియ్యవలాను
పలాపలా ప్రాయిడిచా ఆ చట్టు బండేమొ
గుంటిలోపల సీతా దూరి ఎల్లిపోతుందో
చెడితినేననీ రఘురామా జడ బట్టినాడే".

ఆమిదిలో రాముడు పట్టిన ఆ జడ ఇంకా అలాగే వుందని చెప్పుకుంటూ వుంటారు.

## సూచికలు

1. లక్ష్మీకాంతం - పింగళి. నా రేడియో ప్రసంగాలు, పుట-133
2. పురాణ వాజ్మయం పుట - 30
   ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ హైదరాబాదు 1975
3. బసవపురాణ నిర్మాణము — జైనపురాణ ప్రభావము - సౌరభము
   పుట - 52 - 1970
4. తెలుగు సాహిత్యములో రామకథ పుట - 248
5. స్త్రీల రామాయణపు పాటలు — కృష్ణశ్రీ 1955
6. చూడు - మున్నీరు. ప్రాచీన గ్రంథావళి-రాజమహేంద్రవరం-1973.
7. పాడినవారు. సావిత్రి బూచెర్ల, రొద్దంమండలం అనంతపురంజిల్లా.
8. స్త్రీల పాటలు - లక్ష్మీనారాయణ బుక్ డిపో - రాజమండ్రి-4 1986
9. కవిసెల్లె > కౌసల్య
10. అనరేగి > అనారోగి
11. ఎర్రగంగ్గ=తెల్లమొక్కొనే విధంగ్గా
12. లోక దోషనమేము > లోక దూషణ మేమొ
13 అతియ మీరకుండా = జవదాటకుండ
14 పరనశాల > పర్ణశాల
15. లచ్చన > లక్ష్మణ
16. ఊరి మల్లెపు దేవి > ఊర్మిళాదేవి
17. కళదప్పి = బాధతో ముఖము వివర్ణమై
18 పాడినవారు వెంకటమ్మ - చిన్నగోగులవాండ్లపల్లె, వాయల్పాడుతాలూకా
   చిత్తూరుజిల్లా
19 పాడినవారు, కె. ముద్దయ్య, భూతమోళ్ళపల్లె కలికిరిమండలం చిత్తూరుజిల్లా
20. మునికుమారులు = శ్రావణుడు
21. పదవుగ = పదిలముగా

22. కారునంబేరుండగా = కారణంబు + పేరుండగా

23. పాడినవారు బి. కృష్ణయ్య. ముద్దవరం. పేతంచెర్ల (మం) కర్నూలుజిల్లా.

24. షదవుళ < పాదముల

25. పాడినవారు పి. గంగయ్య – తమ్మినాయనిపల్లె. కంమూరుమండలము
చిత్తూరుజిల్లా.

26. పాడినవారు. కె. ప్రభాకర్. పెద్దసెట్టిపల్లె. కుప్పం (తా) చిత్తూరుజిల్లా.

27. అలపోవు = అల్లాడిపోవు

28. అగ్రకోపము = మిక్కిలి కోపం

29. గోపెట్టె < మోషపెట్టె

30. వాసి = కీర్తి

31. పాడినవారు. యశోద - బ్బాచెర్ల - రొద్దమండలం, - అనంతపురంజిల్లా.

32. వచ్చే > వస్తే....కడప మాండలికంలో 'స్త' ను 'చ్చ' గా పలకడం జరుగుతుంది. చూస్తా < చూచ్చా; వస్తా < వచ్చా వంటివి ఇలా ఏర్పడ్డవే

33 వేసితి > వేగితి = బాధపడితిని.

34. రెడ్డెప్పదాసుని ≡ ఈపాటలో కొన్ని కలవాయి రెడ్డెప్పదాసు అని వుండటంతో ఆ పాటకర్త కలవాయి రెడ్డెప్పదాసుగా గుర్తించవచ్చు. ఆతనెవరో ఎక్కడివాడో పరిశీలించాల్సి వుంది.

35. జానపద గేయ రామాయణం పుట - 19

36. రావణున్ని వాలి సముద్రంలోనుంచి తీసుకువచ్చి అంగదుని ఊయలకు కట్టుకొని ఆడించినట్లు కథ. అలాంటి వాలినే చంపిన ఘనుడైన రామునికి బంటునని ఇందలి అర్థం.

37. హనుబాలు < అనవాలు

38. పాడినవారు యమ్. రాజమ్మ. మద్రికుంటపల్లె, నాయల్పాకు తాలూకా.
చిత్తూరుజిల్లా

39. చక్రాజిత్తు ఇంద్రజిత్తు

40. అనబోగిస్తిమి < అనుభవిస్తిమి

41. ఇసము < విషము

42. పై గేయంలో అసంపూర్ణ వాక్యాలు అస్పష్టతవున్నాయి. అంతేగాక పునరుక్తి కూడావుంది. పునరోక్తి జానపదగేయాలకు సహజ లక్షణంగా గమనించనగును.

43. కపిగట్టి = పగబట్టి

44. జానపదగేయ సాహిత్యవ్యాసావళి, పుట - 94—101

45. అయవేద్య < అయోధ్య

46. ఏనిక్కు < ఏనుగుకు

47. యాగాద = ఆ స్త్రీ

48. వల్లేడిలేదు = ఏలుకునేదిలేదు, కాపురం చేసేది లేదు.

49. పాడిననారు అజ్జప్పగారి సిద్దప్ప నడిగడ్డ పుంగనూరు (తా) చిత్తూరుజిల్లా

50. సిల్లాడు = బిడ్డను కను

51. ఇస్సారించేరూ < విచారించేరు

52. కొపెర < కొబ్బెర

53. ఇవగ్యేనములు < విన్నుజ్ఞానములు

54. పైరాలు = సాంబ్రాణి వేసే గరిటె

55. పులకాపచాజేశా < పైన ఛిలకరించడం.

# జానపదగేయాలలో భారతం

రామాయణ భారతాలు జానపదుల్ని ఎక్కువ ప్రభావితం చేసినప్పటికీ గేయ సాహిత్యంలో రామాయణానిదే అగ్రస్థానం. భారతానికి సంబంధించిన గేయాలు అతి తక్కువ. అయితే జానపద దృశ్యకళా రూపాలలో మాత్రం భారతమే ఎక్కువగా పరిపోషింప బడ్డది. ముఖ్యంగా వీధి నాటకాల విషయంలో భారత నాటకాలున్నంత సంఖ్యలో రామాయణ సంబంధ నాటకాలూ చాలా తక్కువ. దానికి నిదర్శనం జానపదులు నిర్వహించే భారతోత్సవాలే. అయినప్పటికీ గేయ సాహిత్యంలో రామాయణం, నాటక సాహిత్యంలో భారతం ఎక్కువగా పరిపోషింపబడి ఒక సమతౌల్యం పాటింపబడింది.

రామాయణకథ విని కరుణ రసంతో కరిగిపోయిన జానపదుడి గుండె భారతంలో నవరసాలలో మునిగి తేలి స్వచ్ఛము, నిర్మలము అయిన ఒకానొక వైరాగ్యపూరితమైన ప్రశాంత స్థితిలోకి చేరుకుంటుంది. భారతం యొక్క గొప్పతనం అలాంటిది. ఈ భారతాన్ని అష్టాదశ పురాణాల కర్త అయిన వ్యాస మహర్షి సుమారు లక్ష శ్లోకాలతో రాశాడు. శౌనకాది మునులు అపూర్వము, అద్భుతము, సంపూర్ణము, పవిత్రమూ అయిన కథ చెప్పమని రోమహర్షుడిని అడిగినప్పుడు దాని గొప్పతనాన్ని గురించి అతడిలా చెబుతాడు.

సీ॥ "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని<br>
యధ్యాత్మవిదులు వేదాంతమనియు<br>
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని,<br>
కవి వృషభులు మహా కావ్యమనియు

లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికులితిహాసమనియు
బరమ పౌరాణికుల్ బహు పురాణసముచ్చ
యంబని మహిగొనియాడు చుండ". [1]

అందులోనే ఆయుష్షు కోరుకునేవారికి దీర్ఘాయిష్షును, అర్థార్థులకు విపులార్థాన్ని, ధర్మార్థులకు నిత్యధర్మ సంప్రాప్తిని, వినయార్థులకు మహావినయ సంపత్తిని, పుత్రార్థులకు పుత్ర సమృద్ధిని, సంపదర్థులకు సంపదలను భారత పఠనం కలిగిస్తుందని కూడా నన్నయ చెప్పాడు. [2]

ఈ భారతంలో ఆది, సభా, అరణ్య, విరాట ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, శాంతి, అనుశాసనిక, అశ్వమేధిక, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణాదిగా పద్దెనిమిది పర్వాలున్నాయి.

రాయలసీమ ప్రాంతంలో భారతానికి సంబంధించిన గేయాలను చెక్కభజనలోను, కోలాటంలోను పెండ్లి, శోభనం వంటి కర్మార్థకాలయిన వేడుకల్లోను, ఎక్కువగా పాడుకుంటారు.

## పాండవుల వనవాసం :

రాజ్యభాగం కోసం పాండవులు దాయాదులయిన ధార్తరాష్ట్రులతో మొదట్నుంచీ పోట్లాడుతూ వచ్చారు. ధర్మరాజు యౌవరాజ్య పట్టాభిషేకానంతరం అతని అర్ధ రాజ్యాన్ని తిరిగి రాబట్టుకోవడానికి కౌరవులు మరో ఎత్తు వేశారు. మాయాజూదంలో ధర్మరాజును ఓడించి అరణ్యాలకు పంపించాలని నిర్ణయించుకున్నారు. ఆవిధంగానే ధర్మరాజును జూదానికి పిలిచి పాచికలాడారు. దానికి శకుని నాయకత్వం వహిస్తాడు. జూదంలో శకుని మాయోపాయాలకు లొంగి ధర్మరాజు తన రాజ్యాన్ని అన్నదమ్ముల్ని, ధర్మపత్నితో సహా సర్వాన్ని పోగొట్టుకుంటాడు దాంతో పాండవులకు అరణ్యవాసం తప్పలేదు

ఈ అరణ్యవాసంలోను, అజ్ఞాతవాసంలోను పాండవులు పడిన బాధల్ని జానపదులు తమ గొంతుల్ని సవరించి పాడుతున్నారు.

అందులో....ధర్మరాజు జూదంలో సర్వస్వాన్ని పోగొట్టుకున్న అంశాన్ని తమ వనగమన ఒడంబడికను తమ్ముడయిన భీమ సేనుడికి వివరించి వాపోయే ఘట్టాన్ని చిత్రీకరించే ఒక చెక్క భజన గేయం రాయలసీమలో ఎక్కువ ప్రచారంలో వుంది.

తమ్ముడా వోరె బీమసేనా ఎంతమోసము జరిగెర ఎంత మోసముజరిగెర

ఎంత మోసము జరిగెరనన్ ఎంత మోసగించెర ॥తమ్ముడ॥
వేడుకార్థము ఆడుదామని అందురూను కూడియు
వేడుకార్థము ఆడినందుకు నిజము కలిగెరతమ్ముడ ॥తమ్ముడ॥
శకునిమామ మనల యింత మోసగించెర తమ్ముడ
మోసపోయి నేను రాజ్యములోడి పోతిర తమ్ముడ ॥తమ్ముడ॥
కౌరవులు నూరుమంది ఒక్క పక్కనున్నారుర
మనము ఏమొ అయిదుమంది ఒక్క పక్క నున్నాముర
తమ్ములార మనము యిపుడు అడవులకు పోదుము ॥తమ్ముడ॥

భీముడు మిగిలిన వారికంటే ఆవేశపరుడు. ఆతనికి ఆగ్రహావేశాలు వస్తే ఒకపట్టాన పోవు. ఆ విషయం తెలుసుకొనేతను జూదంలో ఓడిపోయిన విషయాన్ని మిగిలిన వారితో కాకుండా భీమసేనుడికే చెబుతాడు ధర్మరాజు. ఆతన్ని సమాధాన పరిస్తే.... మిగిలిన వారందరూ తన మాట సులభంగా వింటారని అతని నమ్మకం. కాబట్టే భీముడికి చెప్పినట్లు జానపదుల కల్పన. అయితే భీముడు మొదట ఆరణ్యవాసం వెళ్ళడానికి వప్పుకోడు.

''రాజ్యమిడిచి నేనురాను యుద్ధమైన సేతుము-అట్టి మాటలు పలికినాడు వాయుపుత్రు డప్పుడు''

ఆతన్ని ధర్మరాజు శాంతింప జేసి వనవాసానికి తమ్ముళ్ళని తీసుకెలతాడు.

"మిమ్ములాను వోడితినీ రాజ్యమును వోడితి
కనక-ఆభరణములన్నీ వోడి పోతిని తమ్ముడ ॥తమ్ముడ॥
మనము యిప్పుడు వోడి నామని చాలను చింతను జెందిరి
చాల చింతను చెందిరి వారు కానలకేతెంచిరీ"

## ద్రౌపది వస్త్రాపహరణం :

భారతంలో ద్రౌపది ఒక ఉదాత్తమైన పాత్ర. పురుషాధిక్య సమాజంలో స్త్రీకి ఏనాడూ ఉన్నత స్థానం లభించలేదు మాతృ స్వామిక వ్యవస్థలో తప్ప స్త్రీ స్వేచ్ఛగా బతికిన దాఖలాలు లేవు. ఆమె పితృస్వామ్యానికి కట్టుబానిస. దానికి సీతా ద్రౌపదులే చక్కని ఉదాహరణలు. ద్రౌపది విధ వంచిత భా తీయ సాహిత్యంలోనే కాదు, ప్రపంచ సాహిత్యమంతా తిరగవేసినా ద్రౌపదిలాగా అవమానాలు, అవహేళనలు, కష్టాలు పడిన స్త్రీ కనిపించదు.

మె కోరికలకు, వ్యక్తిత్వానికి, మనస్సుకీ భారతంలో విలు విచ్చిన సందర్భాలే లేవు. అర్జునుడు ఆమెను స్వయంవరంలో పొందినా, పాండవుల యిదుగురు పంచుకున్నప్పుడే ఆమె జీవితం ఎంతపతనమై పోయిందో చెప్పవచ్చు.

జూదంలో ఆమెను ధర్మరాజు పణంగా పడ్డి ఓడ్డి పోవడమ్లు, నిండు సభలో ఆమె వలువలూడ్చడం వంటి అవమానాలెన్నో ఎదుర్కొన్నది. అశ్వత్థామ, సైంధవుడు, దుర్యోధనుడు, కీచకుడు ఇలా ఎందరో ఆమెను అవమానాలపాలు చేసి అవహేళన చేశారు.

అయినా ఆయా ఘట్టాలు చదువుతున్నా, వింటున్నా హృదయం కరిగిపోని మనిషుండడు. భారతీయులకు ఆమంటే అంతటి అపారమైన సానుభూతి, అభిమానం. జానపదులు కూడా ద్రౌపది అవమానం తమ అవమానంగా, ఆమె కష్టాలు తమ కష్టాలుగా భావించుకొని పాటలు కట్టుకున్నారు.

దానికి ద్రౌపతి వస్త్రాపహరణ ఘట్టాన్ని చిత్రించిన గేయం ఒకమచ్చు తునక.

నిండు కౌరవ సభలో దుర్యోధనుడిఆజ్ఞతో ఏకవస్త్ర అయిన ద్రౌపది చీరలు వలుస్తాడు దుశ్శాసనుడు. ఆ సందర్భంలో కురువృద్ధులు గానీ, బంధువులు గానీ ఎవ్వరూ ఆమెను ఆదుకోలేక పోతారు. చివరికి ఆపద్బాంధవుడయిన అన్న ఆ కృష్ణ పరమాత్మే తనకు దిక్కని తలుస్తుంది అచ్యుతా నను బ్రోవరా అని గొంతెత్తి అర్థిస్తుంది.

''నీలవరన పాలశమన నిన్ను నమ్మినానురా
నన్ను సభకు తీసి అవమానింప బోతున్నారురా
అచ్చుతా నను బ్రోవరా యిక దిక్కు ఎవ్వరున్నారురా
దిక్కు నీవే దీన బాంధవ గ్రక్కునననన్ను బ్రోవరా
కంస మర్దన వంశపాలన కలికి కృష్ణా బ్రోవరా
రాతి నాతిగ జేసియిల ప్రఖ్యాతి గాంచిన దాతవు
కోరి పాండురాజు యింటికి కోడలునై నందుకు
వార కాంతల దీటు సేయగ సభలో బ్రతుకెందుకు
ఆడశ్రీ లను అంటరాదని వేడుకొను చున్నానురా
పాతకుడు దుశ్శాసనుడు నాపైట బట్టుకున్నాడురా
పతుల ఎదుట కట్టుచీరలు విడచుట నీకు ధర్మమా
వాసుదేవ వరకుమార వలువలు దయచేయరా
భీష్మ ద్రోణ కృపులు నారదమౌను లెచట నున్నారురా
రాని వాసపు స్త్రీని యిపుడు రాజసభ కెటుపోదురా'',

అలా వేడుకొన్న ద్రౌపదికి చీరలు సృష్టించి ఆమెను ఆదుకుంటాడు కృష్ణుడు అయినా పాండవులకు వనవాసం తప్పలేదు.

## పాండవుల అరణ్యవాసం :

పాండవులు చేసుకున్న ఒడం బడిక ప్రకారం 12 సం॥లు అరణ్యవాసం ఒక్క ఏడు అజ్ఞాత వాసం చేయడానికి నిశ్చయించు కున్నారు. నార వస్త్రాలు ధరించి ద్రౌపదితో సహా అరణ్యాలకు బయలు దేరారు.

పట్టు పరదాల మాటున సుతి మెత్తని పరుపల పైన పరుండే ద్రౌపది కఠిన శిలలపైన విశ్రమించాల్సి వచ్చింది. అంతఃపుర దారులేతప్ప అన్యప్రదేశాలు తెలియని పాంచాలి అడ్డదిడ్డపు దుమ్ము నేలల్లో, రాళ్ళ బాటల్లో నడవాల్సి వచ్చింది. రాళ్ళు రప్పలు కంపలు, కష్టాలు నిండిన అరణ్యపుదారుల్లో అసూర్యంపశ్య అయిన ద్రౌపది నడచి నడచి అలసి సొలసి అల్లాడి పోతుంది, అసుకుమారి తను పడిన కష్టాలను, బాధలను పరమేశ్వరుడికి ఎరకపరచి వేడు కుంటుంది. తల బాదుకొని కన్నీరు పెట్టుకుంటుంది.

"ఇంక నడువ జాలమమ్మ ఈశ్వర పరమేశ్వరా
శాశ్వతంబుగ పదవులు సుగము మోదమున సర్వేశ్వరా
అర్జునుని ఇల్లాలినైతిని అని గొందు మందున
భద్రముగ అలరాయె వరము ఇస్తివి సర్వేశ్వరా
మాయ జూదములాడి రాజ్యములనే ఓడిరి సర్వేశ్వరా
పాతకుడు దుశ్శాసనుడు నాపైట పట్టెనే ఈశ్వరా
గోరమైన [4] అడవిలో సంసారమాయెను ఈశ్వరా
ద్రోహి దుర్యోధనుడు మోసము జేసెను సర్వేశ్వరా
పంచొ పాండవుల ఐదుగురికి భార్యనైతిని ఈశ్వరా
భార్యనైతి నీశ్వరా నాబాధ మానుపు సర్వేశ్వరా".

జానపదుల దృష్టిలో ధర్మరాజు ధర్మజ్ఞుడు, ధర్మ మర్మజ్ఞుడే కాక సర్వజ్ఞుడు కూడా. జగన్నాటక సూత్రధారి యైన శ్రీకృష్ణుని మాయోపాయాలలో భాగంగానే తమ అరణ్యవాసం కూడా జరుగుతోందని ఎరిగిన జానపదులవాడని

నమ్మకం. అందుకే ద్రౌపది కష్టాల్ని తెలుసుకొని కృష్ణుడి మాయల్ని మర్మంగానే భీమునికి చెప్పినట్లుగా చిత్రీకరించు కున్నారు.

"తమ్ముడ వోరి భీమసేన ద్రాహమ[5] తిశయమాయెర
ద్రాహ మతిశయమాయెర మన భార్య నడవలేదురా
భార్య నడవలేదుర యిక మనము నడవగలేమురా
ఈ మహా వరమెక్కి[6] ఉదకము యెక్కడున్నదో చూడరా
మనము రాజ్యమేలేటప్పుడు నేఁకు మూడారషములర[7]
పులుల మేకలు కొన్ని దినములు జూదమాడెను తమ్ముడ
ఆకుపూతలేని అడవిలో ఆ ఆరు మేకలు మేశర
అడ్డమొచ్చు పెద్ద పులులను సంహరింపుము అర్జున
ఎవరు చేసిన మాయకాదు బావ చేసిన మాయర
బావకు పదహారు వేల భార్యలు కలవాడురా....
వద్దు పగవాని కైన వాసుదేవుని సాక్షిగా
అడ జన్మము కంటె అడవిలో వృక్షజన్మము మేలురా
చేత చెక్కలు కాలిగజ్జలు గల్లు గల్లున మ్రోయగ
జల్లు జల్లున మ్రోయగ యిక గల్లు గల్లున మ్రోయగ
పరగ కంభము పాటి కోదండరామ నిన్ను కొలిచెదము మేము
సకలము రామా".

ఈ పాటను వీధినాటకాల్లోను, చెక్కభజనలోను పాడుకుంటారు.

పై పాటలో తత్త్వసంబంధమైన అంశాలున్నాయి. "ఆకు పూతలేని అడవి' అంటే మానవ శరీరం. ఆరు మేకలు ఉనడం అరిషడ్వర్గాలకు చిహ్నం. ఈ అరిషడ్వర్గాలు క్రూరమృగాల వంటివి. క్రూరమృగాలు, లేళ్ళు, కుందేళ్ళు వంటి ఇతర మృగాలను చంపితిని వేసినట్లే... మానవునిలోని మంచి గుణాలను ఆ అరిషడ్వర్గాలు చంపేస్తాయి. తద్వారా మనిషిలో మోహం, లోభం, స్వార్థం వంటి మృగత్వలక్షణాలు పెల్లుబికి సమాజ భ్రష్టత్వం జరుగుతుంది. అందుకే ఆ పులుల్ని జయించమని అర్జునిడికి తాత్త్విక బోధచేసినట్లు గ్రహించాలి.

పోతే "ఆడజన్మము కంటె అడవిలో వృక్షజన్మము మేలు" అనడంతో సమాజంలో స్త్రీ ఎంత అణచివేతకు గురి అవుతోందో తెలియ చేసినట్లయింది,

## సైంధవుని దురాగతం :

సైంధవుడు కౌరవుల బావమరిది దుశ్శల భర్త. ద్రౌపదికి సోదరుడి వరుస. కామంవిండిన కళ్ళకు వావి వరుసలు గుర్తుకురావనడానికి నిదర్శనం సైంధవుడు. ఈ సైంధవుని వృత్తాంతం భారతంలోని అరణ్యపర్వం షష్ఠాశ్వసంలో వుంది[8].

కథాపరంగా ఇది కామ్యకవనంలో జరిగిన వృత్తాంతం.

కామ్యకవనంలో వనవాసం చేస్తున్న పాండవులు ఆశ్రమంలో ద్రౌపది నొక్కతినే వుంచి తమ తమ పనుల మీద అడవిలోకి వెళ్ళిపోతారు. అదే సమయంలో సైన్యంతో అటువైపు వెలుతున్న సైంధవుడు ఆమెను చూస్తాడు. ఆమె అందాన్ని చూసి మోహిస్తాడు. రథందిగి ఆమె చెంతకువచ్చి తన కోరికను చెల్లించమంటాడు. ద్రౌపది నిరాకరిస్తుంది. దాంతో ఆమెను బలవంతంగా ఎత్తి రథంలో ఉంచుకొని ఎత్తుకు పోతుంటాడు. ఆ విషయం తెలుసుకున్న పాండవులు ఆతన్ని ఓడించి బంధిస్తారు. అవమానించి పంపిస్తారు

ఈ సంఘటన జానపదుల్ని ఎంతగానో కదిలించి వేసింది, ఆ వృత్తాంతాన్ని పాటలుగా కట్టి పాడు కున్నారు. మచ్చుకొకటి.

సైంధవుడి రథంలో దిక్కుతోచని స్థితిలో ద్రౌపది సైంధవుడెలా బలత్కారంగా తన్ను ఎత్తుకు పోతున్నాడో తెలుపుతూ ఆమకొమ్మని ఈ గేయంలో కృష్ణున్ని వేడుకుంటుంది.

> "నగధరా నారాయణ నవనీతచోరా బ్రోవరా
> దిక్కునీవే దీన బాంధవ గ్రక్కున నను బ్రోవరా
> రుక్మిణీ పతినాయక మా కష్టముల నేర వేర్పరా

ధర్మ భీమార్జునులు మాద్రితనయు లెవ్వరు ఇచటలేరురా
ఫలములకు ఛేటుపోయిరో యిదివరకు రాకున్నారురా
పతులు లేని సమయమందున పర్ణశాలలో యుండగా
లక్షణమౌ సైంధవుండు దుక్షణముతో వేతెంచియు
అమ్మ ద్రౌపది బావమరదులు అందురును క్షేమమే
పంచ పాండవులు యెటుల పోయిరో నవితరో వివరింపుము
వంటిగా ఈ వనములో వనములకున్నది దానికై
పోయి వచ్చెదమనుచు రథమును పొందుగా నడిపింపుమూ....
ఖడ్గమునే మరచితీనని చెంతకు యేతించియు ...
ఖడ్గము అందివ్వగానే కరము బట్టి లాగియూ....
రథము వేగమె పోవుచున్నది దారికడ్డము రాగదే
పంచపాండవులైదుగురు యేతెంచినది మొదలుగా
నా కనుదినములు కష్టములు నెరవేర్చితీవు కృపనీదే...'

## సుదేష్ణ కొలువులో సైరంధ్రి :

పన్నెండేళ్ళ అరణ్యవాసం పూర్తి చేసిన పాండవులు అజ్ఞాతవాసం కోసం విరాటకొలువులో ప్రవేశిస్తారు. మారువేషాలతో బాటు మారుపేర్లతో విరాటుని కొలువులోకి చేరుకుంటారు. ద్రౌపది సైరంధ్రిగా మారి సుదేష్ణాదేవి అత్మపురంలోకి చేరుకుంటుంది.

దురదృష్టం ముందు పుట్టి ద్రౌపది వెనుక పుట్టినట్లుంది ఆమె పరిస్థితి. అక్కడికి వెళ్ళిన ఆమెకు కష్టాలు తప్పలేదు. అక్కసుదేష్ణను చూడవచ్చిన కీచకుడు ఆమెను చూసి మనసుపడతాడు. ఆ విషయం ద్రౌపదిక తెలియకుండా సుదేష్ణకు నచ్చచెప్పి ఆమె నెలాగయినా తన మందిరానికి పంపించ మంటాడు. కీచకుడికి భయపడి సుదేష్ణాదేవి సరేనంటుంది. మధిర పేరుతో పాత్రయిచ్చి కీచకుని అంతఃపురానికి సైరంధ్రిని పంపుతుంది. అక్కడ కీచకుడు ఆమెను బలాత్కరించడానికి ప్రయత్నిస్తాడు.

ఆ సమయంలో ద్రౌపది కీచకుడికి తనను విడవమనీ, లేనిచో గంధర్వు లయిన తన పతులు నిన్ను తుంచి వేస్తారని చెపుతుంది.

ఈ అంశాన్ని తెలిపే ఈ క్రింది పాటను అటు కోలాటం, చెక్కభజన లోను ఇటు కీచక వధ నాటకంలోను పాడుకోవడం జరుగుతుంది.

అంట రాకుమురా కీచకయోరి తుంటరితనమేలా
అంటరాకుమురా కీచకా నేనొంటిదానను కాను భువిలో
పంచపతులున్నారు వారికి నిజము గానిను త్రుంచి వేతురూ
మాయా జూదమునా గంధర్వులు వోడి రాజ్యమునూ
మాయ జూదమునోడి రాజ్యములోడియుదాయాదులకును
పదిలముగ పదిరెండు యేండ్లు అరణ్యవాసము గడిపి వస్తిమి
కల్లు బోయుమురా కీచకయోరి అల్లరేలనురా నాతో
కల్లుబోయుము అల్లరేల కాంత సుదేష్ణమ్మ పంపెను
కల్లు తెమ్మని నన్ను పంపెను కలహమేలరా కన్న తండ్రి
దాపునున్నారో గంధర్వులు చూచుచున్నారో దేవా
దాపునున్నారు చూచుచున్నారు ధర్మ పాచ్చా భస్దలసచు
పప్పుగనుయక తను విన్న యిప్పుడేను త్రుంచ వేతురు
వేశ్యనాదురా కీచక యోరిదాసిదానను దేవా
వేశ్యగానురా దాసిదానను వద్దుర నామీద మొహవల
చిత్రముగ గంధర్వువేవురు చిత్రవధగా వింపకిదవరూ
అక్క చెల్లెలు వనుచునమ్మ పప్పుగా నీవు చూచుకోర
తప్పక శ్రీహరి నిను యిప్పుడే రక్షించుగాక
ధరణిలో కలవాయుసేషాద్రి వాసుడు కాసి రక్షింపుము కౌసల్యవరపుత్ర

## ధృతరాష్ట దుర్యోధనుల సంవాదం :

అనుకున్న ప్రకారం పాండవులు అరణ్య అజ్ఞాతవాసాలు చేసి తిరిగి వచ్చారు. వారి కార్యం వారు నిర్వర్తించారు. కానీ దుర్యోధనుడు వారికి

అర్ధరాజ్యం యివ్వడానికి ఇచ్ఛగించలేదు. ధృతరాష్ట్రుడు వచ్చి ఎంతగానో చెబుతాడు. అయినా దుర్యోధనుడు ససేమిరా వప్పుకోడు చివరికి "సూదిమోపి నంత స్థలమైనా ఇవ్వనంటాడు. ఈ సందర్భంగా వారిరువురి మధ్య జరిగిన సంభాషణ ఎంతో హృద్యంగా దుర్యోధనుడి హృదయాన్ని ఆవిష్కరిస్తుంది.

ధృత : పంతమేలనురా దుర్యోధనా చింతమానుమురా
పంత మేలర పాండవులతో చింత యేలరా
సంపదులు కలిమిలేములు శాశ్వితంబులు కావునా కన్న తండ్రీ
కుంతి తనయులురా ధర్మమునందు మంచి యోగ్యులురా
కుంతి తనయులు మంచి యోగ్యులు కన్నతండ్రియు లేని బిడ్డలు
పక్షపాతము వలదు వారికి పంచి యివ్వుము అర్ధ రాజ్యము.

దుర్యో : అయ్యో నా తండ్రి కౌరవ రేణ్యయేల ఈ సాక్షి నీకు
కలిసి యుండ జాలమయ్యా కలలోనైన పాండవులతో
సూదిమోపినంత రాజ్యము సూపి యిస్తునంచే యివ్వము.

ధృత : పాండురాజురా నా తమ్ముడు చేరే స్వర్గమురా
అది మొదలు వారి నేను ప్రేమతో పెంచు చుంటిని
వారినీ విడనాడి నేను విముషమైన బ్రతుకజాలను
ధరణీలో కలవాయి కై లాస వాసుదు కాపి రాక్షింపుము
కౌలస్య పరపుత్ర.

## సుభద్రా బలరాముల సంవాదం :

అన్నదమ్ముల బిడ్డల్ని అక్కచెల్లెళ్ళ బిడ్డలకు ఇచ్చి పుచ్చుకోవడం గానీ మేనత్త బిడ్డల్ని మేనల్లుళ్ళకు ఇవ్వడంగానీ, మేనకోడళ్ళను మేనత్త కొడుకులు చేసుకోవడంగానీ మేనరికం అనిపించు కుంటుంది. భారతీయుల్లో ఈ మేనరిక వివాహాలపైన మోజు ఎక్కువ. ఈ మేనరికాన్ని నిలుపుకోవడానికి బిడ్డలున్న తల్లిదండ్రులు తహ తహ లాడుతారు. ఈ అంశాన్ని తెలిపే ఘట్టం భారతం లోనూ వుంది,

శశిరేఖ బలరాముడి కూతురు, అందాల బరిణ, సుభద్ర కొడుకు అభిమన్యుడు. వీర కుమారుడు, ఇద్దరికీ ఈడూజోడు సరిపోతుందనీ, ఇద్దరికీ పెళ్ళి చేసి మేనరికం నిలుపుకోవాలనీ ఆశ పడింది సుభద్ర. పోయి బలరామున్ని బిడ్డ నివ్వమని అడిగింది. అయితే బలరాముడికి పాండవులపైన, వారి బిడ్డలపైన సదభిప్రాయం, అభిమానం ఉన్నట్లు కనిపించదు. పాండవులన్నా వారి కొడుకు లన్నా అసమర్థులని అతని అభిప్రాయం కాబోలు. అల్లారు ముద్దుగా పెంచుకున్న తనకూతుర్ని అభిమన్యుడికిచ్చి అడవుల పాలు చేయలేనని ఖరాఖండిగా చెప్పేస్తాడు ఆ సమయంలో వారి మధ్య జరిగిన సంభాషణ, ఒక సీమంతం పాటలో ఎంతో హృద్యంగా సాగిపోతుంది.

సుభద్ర: సిన్నాది శశిరేఖ చిన్నవాడు అభిమన్యు యిద్దరికీ దేరన్నా ఓ బలరా
మన్నా యిద్దరికీ దేరన్నా
పుట్టింది శ్రీ పుత్రి పుట్టినప్పుడు వాళ[10] పుట్టినే నోస్తీరన్నా
ఓ బలరామన్నా కన్నెనడగ వస్తిరన్నా

బలరా : ఉయ్యాల తొట్లల్లో ఊగేటి నాపుత్రి అడవులకెటులంపుదూ
ఓ సుభద్రమ్మా అడవలకెటు లంపుదూ పాలుహన్నము[11] పెరుగు
భుజియించే నాపుత్రి ఏ పాకు తిన పెడుదునా ఓ సుభద్రమ్మా ఏ పాకు
తినబెడుదునా

సుభద్ర: మేనత్త కొడుకని మెచ్చినన్నిచ్చినారూ హెచ్చు తక్కువ లెంచితిరా
ఓ బలరామన్నా హెచ్చు తక్కువ తెంచితిరా ..."[12]

## సూ చి క లు

1. శ్రీమదాంధ్రమహాభారతము — ఆది - ప్ర - ఆ - 31

2. శ్రీమదాంధ్రమహాభారతము — ఆది - ప్ర - ఆ - 33

3. ఆడప్రీలు > ఆడశ్రీలు - ఒకే అర్థానిచ్చే రెండు పదాలను కలిపి పలకడం జానపద వ్యవహారంలో కనిపిస్తోంది. బోలమాను, ఇంజక్షను, సూదులు, ఆడప్రీలు అలాంటివే.

4. గోరమైన < ఘోరమైన

5 దాహము < ద్రాహము

6. మహీవరము > మహావరము = కొండ

7. వరషము < వర్షము

8. చూడుము. శ్రీమదాంధ్రమహాభారతం - అర - ప - 144 నుండి పద్యాలవరకు - 266

9 ధర్మపక్షపాతులగుచు > ధర్మపాచ్చాభగ్గులగుచు

10. పుట్టినప్పుడు వాళ = శశిరేఖ పుట్టినప్పుడే కోడలిగా ఆశ పడ్డానని అర్థం.

11. హన్నము < అన్నము

12. పాడినవారు. ఆర్. లక్ష్మమ్మ. కురవపల్లె, పులిచెర్లమండలం, చిత్తూరుజిల్లా.

# జానపద గేయాలలో భాగవతం

వ్యాసుడు రాసిన అష్టాదశ పురాణాలలో భాగవతం ఒకటి. భగవంతుడినే నమ్ముకున్న భక్తుల్ని ఆదుకునే భగవల్లీలా విశేషాలతో కూడుకున్నది భాగవతం.

దుష్టుల దౌష్ట్యాలు మితిమీరినప్పుడు ధర్మానికిగ్లాని కలిగి, నీతి నిలువ నీడ లేకుండా కృషించిపోయి అధర్మం హద్దు మీరి ప్రవర్తించి నప్పుడు శిష్టరక్షణ దుష్టశిక్షణ చేసి ధర్మాన్ని పునరుద్ధరించడానికి ప్రతి యుగంలోనూ పుడతానని ఆ మహావిష్ణువే గీతలో స్వయంగా అన్నాడు.

"యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం"
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"
(భగవద్గీత - అధ్యా-4,శ్లో-7,8)

అలా ఎత్తిన భగవంతుని కొన్ని అవతార విశేషాలు భాగవతంలో ఉన్నాయి,

జగన్నాటక సూత్రధారి అయిన పరమాత్మ ఆర్తజనావళిని ఆదుకు ఆపద రక్షకుడిగా, వరాల నొసగే వరదుడిగా, మోక్ష ప్రదాతగా ఎన్నో రకాలుగా భాగవతంలో దర్శన మిస్తాడు. సొగుసైన శైశవ క్రీడలతో అలరించే అల్లరి కృష్ణుడు, ప్రహ్లాదుని కాచిన నరసింహుడు కరిరాజును కాచిన కరి వరదుడిగా, వామనుడై బలిని తొక్కి అనంతాన్నా క్రమించిన అనంతుడిగా ఎన్నో రకాలుగా భాగవతంలో విష్ణువు చిత్రీకరించ బడ్డాడు.

అలాంటి భాగవతం అటు పండితుల్ని ఇటు పామరుల్ని ఒకే విధంగా ప్రభావితం చేసింది. ఎన్నో భాగవత ఘట్టాలను జానపదులు తమ గేయాలలో నిక్షిప్తం చేసారు.

కాబట్టి భాగవతం జానపదగేయాలలో విస్తరించిన వైనాన్ని పరిశీలిద్దాం.

నా సేకరణలోని గేయాలు గోపీకృష్ణులకు సంబధించినవి, లక్ష్మీ నరసింహులకు సంబధించినవి మాత్రమే వున్నాయి. కాబట్టి ఈ అంశాలను 1. కృష్ణలీలలు 2. లక్ష్మీనరసింహులు అన్న శీర్షికల కింద పరిశీలించడం జరిగింది.

## 1) కృష్ణలీలలు :

కృష్ణ లీలలు అంటూనే యమునా తీరం, మధురానగరం, ద్రేపల్లె, గోపికలు చిన్నికృష్ణుడి అల్లరి చేష్టలు ఇవే గుర్తు కొస్తాయి. గోపికల నేడిపించిన గొల్ల కృష్ణుడి ఆగడాలు జానపదగేయాలలో రసరమ్యంగా చిత్రీకరించబడ్డాయి,

కృష్ణలీలకు సంబందించిన అంశాలను పరిశీలనా సౌలభ్యం కోసం యశోదాకృష్ణులకు సంబంధించనవి, సత్యాకృష్ణులకు సంబంధించినవి అని మూడు విభాగాలుగా పరిశీలించవచ్చు.

## యశోద కృష్ణులకు సంబధించిన పాటలు :

శ్రీమన్నారాయణుడు దుష్టశిక్షణార్థం దేవకీ వసుదేవుల పంటగా జైల్లో పుట్టాడు. అయితే ఆబాలదేవుడికి లాల పోసి తలార్చి బొట్టు పెట్టి, బజ్జితాపి బొజ్జనిమిరి నిద్దరూపుతూ జోలలు పాడి మైమరిచి పోయే అదృష్టం మాత్రం దేవకికి దక్కలేదు. ఆచిన్ని కన్నయ్యకు లాలి ఊపి సేవలుచేసే అదృష్టం చాలాగొప్పది ఆ యశోద బాలకృష్ణుడికి జోల ఊపిన రీతి హృదయరంజకంగా సాగుతుంది,

"లాలి కృష్ణయ్య నీల మేఘ శ్యామన్న
పాలా గోపాలన్న పవ్వళించగ రావయ్య

శృంగారించిన మంచి బంగరు ఉయ్యాలలో
ఆదిశేషుని పాన్పుమీద పవ్వళించగ రావయ్యా
ఇంద్రలోకాన నీకెవ్వరు కావలనయ్యా
లలితాంగ శ్రీ సత్య బామాదేవి కావలనా
రుక్మిణీయు కావలెనా రాధాదేవి కావలనే....
పొద్దు చాలపోయెను నా ముద్దు నాకివ్వుమురా
గజ్జలం జాయిలు గల్లున మ్రోయంగ
లాలి శ్రీకృష్ణయ్యా నీలమేఘశ్యామన్నాలాలీ''.

శ్రీకృష్ణుడి అల్లరికి వ్రేపల్లె అల్లాడి పోయింది. వ్రేపల్లె స్త్రీలు ఇక సహించలేక పోయారు. కృష్ణ బాధితులందరు మూకుమ్మడిగా యశోదఇంటిపై కొచ్చారు. ఆతను చేసిన దుష్ట చర్యలనన్నింటిని ఏకరువు పెట్టారు

ఆ సందర్భంగా గోపీ స్త్రీలు యశోదకు కృష్ణుడు చేసిన అల్లరి చేష్టల్ని గురించి చెప్పడం, దానికి యశోదాదేవి కృష్ణున్ని ఇదేమని అడగడం, కృష్ణుడు ఏమీ తెలియని వాడిలా దానికి తగినట్లు సమాధానం చెప్పి పిల్లడగాదురా బాబూ పిడుగని పించుకునే వైనం రసరమ్యంగా సాగుతుంది.

గోపిక : అమ్మా! తనయుని దుడుకులు తెల్పెదమె తల్లీ!
తనయుని తప్పులు తెల్పెదమె.
రాచబిడ్డడనుచు మేము వెరచి చెప్పలేమునీతో
చిన్నవానికి పిచ్చి చేష్టలు కొంటె కాంద్రెవ్వారు నేర్పిరి ॥ అమ్మా ॥

యశోద : అయిదుయేండ్ల బాలుడు వాడిన్ని పనులు సేయ నేరడు
మరుగు బెట్టగనేల నాతో మర్మములే వేగ విప్పిభామ
దాచగ నేలనే దాచగ నేలనే ॥ భామ ॥

గోపిక : నిన్న మాపటి వేళ మాకన్నె చిన్న దాన్ని బట్టి
కన్న తిప్పలుబెట్టి పెదవులు కొరికి పరుగిడొచ్చినాడు ॥ అమ్మా ॥

యశోద : యేలరా కృష్ణయ్య! గొల్లభామల ఎంగిలి పెదవులు యేమి రుచియని
కోరికినావురా
యెంత కొండెకాడవన్న కృష్ణా భామలపై నీకు చలమేలరా

కృష్ణుడు : చక్కని శ్రీకృష్ణ రమ్మని
చిక్కితివి నీ ముద్దు తెమ్మని
రక్కసివలె ముద్దు పెట్టితె
వొక్కపల్లిటు సోకెనేమొ
తెలియదే తల్లి తెలియాదే

గోపిక : పెరుగు చిలుకుచుండగా నా మరుగున నిలుచున్న క్రిష్ణుడు
పెరుగు చారెడు వించుకోని జుర్రి పరుగిడి పోయినాడు
అడుగావే తల్లి అడుగావే

యశోద : అడిగినంత వెన్న నీకు పెరుగునే మన యింట్లో లేవా
దుడుకుతనమున పొరుగిండ్లకు దొంగిలీ తిన బోవనేల క్రిష్ణా
పడుచులపై నీకు చలమేలనురా.

క్రిష్ణుడు : దేవరాకు పెట్ట వలెనని యీవరా కనుకొంటుయొంటిరి
అ దేవుడేమొ జుర్రిపోతే తెలియకానా మీద పెట్టిరి తెలియాదే ॥ తల్లి ॥

గోపిక : నిన్న మాపటి వేళ మా కన్నెది జలంబులాడగ అందు
యెవ్వరు లేరు దానం బివ్వుమని చెయ్యొగ్గినాడు
అడుగావే తల్లి అడుగావే

యశోద : ఆడవారు జలకమాడగ మొగవాడవు యేలబోతివి
దూడపిల్లను దానమిమ్మని అడుగవలసినదేమియున్నది
క్రిష్ణా పడుచులపై నీకు చలమేలనురా.

క్రిష్ణుడు : పండ్లు పండిన కిత్తళీ చెట్లుండగా అసందుకే నొక
పండు యిమ్మని చెయ్యొగ్గితి రెండోది యరుగనమ్మ తెలియాదే

గోపిక : బట్టలోపల కట్టుకున్నవి పండ్లు యేమిటి వంటు కుచములు
గట్టిగా బిగబట్టి దీండ్ల కరీదెంతని అడిగినాడు
తల్లీ తనయుని దుడుకులు తెల్పెనమే

యశోద : యేలరా క్రిష్ణయ్య గొల్ల భామాలా పాలిండ్ల బట్టుక
యేమేయేమొ చేసినావట యెన్నటికి బుద్ధిరాదా క్రిష్ణా

క్రిష్ణుడు : పండు అంటే పట్టితి
పాలిండ్లు అంటే విడిచితి
పాలిండ్లు గిండ్లు యెరుగనమ్మ
పగయానాపై చెప్పుతారు దెలియాదే తల్లి

గోపిక : గొల్ల భామలంత గూడి చల్లలమ్మను బోవుచుండగ
చల్లబానకు సుంకమిమ్మని చిల్లులూ పడగొట్టినాడు అడుగావే తల్లీ

యశోద : యేమిరామకృష్ణయ్య! గొల్లభామలు చల్లనమ్మబోతె
చల్లబానకు సుంకమిమ్మని చిల్లులూ పడగొట్టినావట కృష్ణా

క్రిష్ణుడు : చిల్లులూగ సమయమున
వడగండ్ల వర్షమొచ్చి బానలు
చిల్లులూ పడగొట్టెనేమొ
చిల్లరాపనులెరుగతల్లి తెలియాదెతల్లి

గోపిక : నోటి నిండా విడెము వేసుక
సీటుగా నిలుచున్న కృష్ణుడు
దారిపోయే చిన్న దానిపై సూటిగా వుమ్మేసినాడు ॥ అమ్మ ॥

యశోద : తమ్మయని చిన్న పాపపై వుమ్మేస్తివట గోపాలక్రిష్ణా
చిల్లరాబుద్ధులు నీకు కొంటె కాండ్రెవ్వారు నేర్పిరి క్రిష్ణ ॥ భా ॥

కృష్ణుడు : వెండికొయ్య నూదుకొంటూ

వేడుకాతో ఆడుకుంటు ఆట బడిన కావరాన గోడపై వుమ్మేస్తి తల్లి॥తె॥

గోపిక : గొల్ల భామలంత గూడి

స్నాన మాచరించేటప్పుడు చీరెలన్నియు తీసుకొని చెట్టుపై గూర్చిండినాడు.

తల్లీ తనయుని తప్పులు దెల్పెదమె ॥అ॥

యశోద : యేలరా క్రిష్ణయ్య గొల్లభామలు స్నానము జేయగ
చీరెలన్నియు తీసుకోని చెట్టుపై కూర్చుండి నావట క్రిష్ణా ॥ప॥

క్రిష్ణుడు : చెట్టుపై కూర్చిండి నేను పండుతినే సమయమందు సుడిగాలి వచ్చి
చీరలన్నియు చెట్టుపైబడ నేసెతల్లి తెలియదె తల్లితెలియాదె''.

వద్దన్నది చేసే అలవాటు మంకుపట్టు పిల్లలకు పుట్టుకతో వచ్చేలక్షణాలు. చిన్ని కృష్ణుడికి ఆ లక్షణాలు మరీ ఎక్కువ. అందుకే యశోదమ్మకు భయం. గోపికల్ని ఏడిపించడం, వ్రేపల్లెలోని గొల్లవారి యిండ్లలో పాలు పెరుగు వెన్నలు దొంగలించడం వంటి ఎన్నో తుంటరితనాలు చేసినాయశోద బాధపడలేదు. బావులకాడికి పోతాడు, చెరువుల్లో మడుగుల్లోదిగి ఈత కొడతాడు. అదే ఆమె భయం. కాళంగి మడుగులో కాళ సర్పం వుంది. దాని బారిన ఎక్కడ పడ తాడోనని ఆమె అతన్ని కళ్ళకు పత్తులేసుకుని చూస్తోంది. చెవిలో ఇల్లు కట్టుకొని ''కాళంగిదారి మడుగు పోబోకురా కృష్ణా'' అంటూ చెబుతూనే వుంటుంది. అయినా కృష్ణుడు ఆగలేదు వెళ్ళనూ వెళ్ళాడు, కాళియ మర్ధనం చేయనూ చేశాడు.

ఆ సందర్భంగా యశోద కృష్ణుడికి బుద్ధులు గరిపే ...ఒక నలుగు పాటలో యశోద మాతృ హృదయం ఆవిష్కరింప బడింది

''కాళాంగి దారి మడుగు - కాళాంగి దారిమడుగు
పోబోకురా కృష్ణ - రాబోకురా కృష్ణ ॥కాళాంగి॥

వానలు కురవంగ వంకలు దొర్లంగ పాముసేరున్నాదన్నా ॥కొళాంగి॥
బెమ్మా ఈశ్వరూని దలచి - మచ్చు మంత్రము నేర్చి ॥బె॥
రాజ్యమేలేను కృష్ణా పోబోకురా కృష్ణ-రాబోకురా కృష్ణా॥కొళాంగి॥"1

## గోపీకృష్ణులకు సంబంధించిన పాటలు :

ఎన్ని ఆగడాలు అఘాయిత్యాలు చేసినా వ్రేపల్లె యువతులు కృష్ణుడంటే అపారమైన ప్రేమాభి మానాలు కురిపిస్తాయి. అతని ముగ్ధమనోహర రూపం అతని మోహన వంశీ ప్రభావం అలాంటిది. గోపకల్ని తన్మయుల్ని చేసే అతని ఆకారం, అభినయం, అల్లరి చేష్టలు, మురళీ గానాలు వింటుంటే, చదువుతుంటే మైమరచిపోని భారతీయుడుండడు. మరి వాటి ననుభవించిన గోపికల గురించి వేరుగా చెప్పాలా!

ఒక భజన పాటలో గోపికలు అతన్ని ఆరాధించిన తీరు చూడండి.

"రారా సుధాకర సుందరాకారా - యిందిరా మనోహర
నంద నందనా క్రిష్ణా - క్రిష్ణ మురారి
భళారె మాధవ - మురళీనందన క్రిష్ణా
జగతీ ప్రేమ కనుగొనలేవ - కావగరావ బ్రోవగలేవా
పావనలీల భక్త విపాలా - కావుము శరణు బ్రోవగలేవా
అనుదినముని స్మరణము సేసితి - మాధవ
మురళీ నంద నందనా క్రిష్ణా-గోపీకుల మురళీనంద నందనా క్రిష్ణా "2

ఎంత ఆరాధించినా, అభిమానించినా కృష్ణుడు అల్లరి మాత్రం ఆపడు. కొత్తగా కాపురానికొచ్చిన ఏ యింటి కోడలయినా సరే... వ్రేపల్లెలో ఆమెపైన కృష్ణుడి కన్ను బడకుండా వుండదు. పడి అల్లరి పాలుగాకుండా తప్పించుకోలేదు.

ఒక కోలాట పాటలో (వ్రేపల్లెనుంచీ ఒక కొత్త కోడలు మధురానగరికి చల్లలమ్మకు రావడానికి బయలుదేరుతుంది. ఆ విషయం తెలుసుకున్న కృష్ణుడు ఆమెను నడివీధిలోనే అడ్డగిస్తాడు. కొంగు పట్టి లాగుతాడు. ఎత్తి ముద్దు లాడుతాడు. ఇక ఆమె ఇరకాటంలో పడిపోక ఏముంది!

గోపిక : విడవర నడివీధిలోపల జడియక జనులెల్ల చూడగ
నడక తడబడ గుంజదవు బహు బడలితినిదే పడచుదానను

కృష్ణుడు : విడువనె నీ నడక చూపి కడువడిగనే బ్రమసి నాను

గోపిక : నడక తడబడ గుంజదవు బహు బడలితినిదే పడచు దానను
అత్త మామల చాటుదానను కొత్తగ కాపురము వస్తిని
ఎత్తుకొని ముద్దాడి చెక్కిలి నొక్కగ నవ్వంగ నేటికి ॥ విడ ॥

కృష్ణుడు : మత్తగజగమనరో మీ అత్త ఆజ్ఞ మీరననుచు
తత్తరీనని బొంకెదవు నీటక్కరి తనమెల్ల మానుము

గోపిక : బల్లు బల్లున తెల్లవారెను పల్లెలకు చల్లమ్మ పోవల
మల్ల వచ్చిన వెనకనీతో మాటలుంటె నిలుతుగానీ³

కొత్త కోడళ్ళంటే చిన్ని కృష్ణుడికి మోజెక్కువ కాబోలు. ఒక కొత్త కోడలు మజ్జిగ చిలుకుతుంటుంది. అక్కడికి వెళ్ళి పాలు పెరుగు వెన్న అడుగుతాడు. ఆమె అత్తగారిని అడగమంటుంది అయితే నా ముద్దు తీర్చ మంటాడు కృష్ణుడు. ఇది మంచి పని కాదంటుందామె. అలాంటి మంచి పనులు చేయకుంటే నన్ను మాధవుడని ఎలా అంటారు అని కొంటెగా సమాధానం చెబుతాడు.

గోపిక : రేపల్లె వాడలాకు క్రిష్ణమూరితీ నీవు ఏమి పని కొచ్చినావు చిన్నిమాధవా

కృష్ణుడు : రేపల్లె వాడలాకు గొల్లభామా నేను పాలు పెరుగు వెన్న కొస్తి
పల్ల వాధరీ

గోపిక : కొత్త కోడాలినయ్య క్రిష్ణమూరితీ మా అత్తా నన్ను అడగవయ్యా
చిన్ని మాథవా

క్రిష్ణుడు : కొత్తా కోడాలివైతే గొల్లభామా నీకు రొక్క మిస్తా పుచ్చుకోయె
పల్లవాధరీ

గోపిక : నీ రొక్కములు నా కొద్దు క్రిష్ణమూరితీ నీవు కోటప్ప కన్న
కట్టవయ్యా చిన్ని మాధవా

క్రిష్ణుడు : కోటప్ప కన్న కడతానే గొల్లభామా నా కల్లాడు కోర్కె దీర్చు
పల్లవాధరీ

గోపిక : అట్లా మాట్లాడబోకు క్రిష్ణమూరితీ నీవు రోత పట్టి పోతావు
చిన్నిమాధవా

క్రిష్ణుడు : ఉల్లి మల్లి చీర పెస్తి గొల్లభామా నా కల్ల చూడు కోర్కె దీరు
గొల్లభామా

గోపిక : మంచిపని చేస్తివయ్యా క్రిష్ణమూరితీ మా యింటి వాడు గోపగాడు
చిన్ని మాధవా

కృష్ణుడు : మంచిపని నేయకుంటే గొల్లభామా నన్ను మాధవుడందురంటే
పల్లవాధరీ.

ఎవరికీ భయపడని మనస్తత్వం కృష్ణుడిది. బ్రహ్మాదులకే కాదు ఆ బ్రహ్మ రాక్షసులకు పైతం భయపడడు, ఇక వ్రేపల్లె మగవారికి భయపడతాడా. పూతననే కాదు మహా మహా రక్కసుల్నే ఎంత సునాయాసంగా ముక్కలు ముక్కలు చేశాడో అంత సునాయాసంగానే వ్రేపల్లె ఇంతుల్ని అల్లరి చేయగలడు వయసులో చిన్నవాడైనా పెద్ద పెద్ద పనులు చేస్తాడు. చిలిపి శృంగార సరస ప్రవీణుడు, మహావీరుడు, ఆ చిన్ని బాలకృష్ణుడు. ఆతని శృంగార చేష్టలెలాంటివో ఒక చెక్క భజన పాటలో రసరమ్యంగా చిత్రీకరించ బడ్డవి.

గోపిక : చల్లలమ్మను పోనివ్వర ఓ చిన్నిక్రిష్ణ చలములేల నాతో నీకు
చలములేల చిన్నిక్రిష్ణ చాలు చాలు మరలిపోర
మావారు చూచితేను తుంటరిక్రిష్ణ బుద్ధి చెప్పేరు

కృష్ణుడు : ఎవరైన భయములేదే ఓ గొల్లభామ చల్ల లెక్కడమ్మ బోదువే
చల్లబాన కింద పెట్టి సుఖమునిచ్చి పోవేమె భామ
వనితరో నిన్ను చూడగ నా మనసు భలే ఆనందమవుతున్నాదే

గోపిక : తుచ్ఛ గొల్లవారి మీద మమతలేలా చిన్నికృష్ణ మరియాదకాదు నీకు

కృష్ణుడు : కొక్కొరోని కోడి కూసె భల్లు భల్లున తెల్లవారే
బంగారు పాలనిండ్లు పట్టనీయె భామ
అతివరో నిన్ను చూడ నా మనసు భలే ఆనందమవుతున్నదే

గోపిక : వాదులాట వద్దు క్రిష్ణ తుంటరిక్రిష్ణ - చలమేలనాతో నీకు
వాదులాట వద్దు క్రిష్ణ వైరమేల నాతో నీకు
మా వారు చూచితేను తుంటరిక్రిష్ణ మర్యాదకాదురా నీకు.

ఒక గొబ్బిపాటలో కృష్ణుడు యమునలో స్నానం చేస్తున్న గోపికల వలువలెత్తుకొచ్చే ఘట్టం వర్ణింపబడింది. ఇందులో గోపికలకు బదులుగా దేవేంద్రుని కూతుళ్ళు, నాగేంద్రుని కూతుళ్ళు జలకాలాడుతున్నట్లు, కృష్ణుడు వారికి తెలియకుండా వారి చీరెలెత్తుకొచ్చినట్లు చెప్పబడింది. ఈ సుదీర్ఘ గేయం రాయలసీమ అంతటా ప్రచారంలో వుంది.

"గొబ్బియాలో కంచికి పోయే దావాలో పంచవన్నె అరుగులే గొబ్బియాలో
" పంచవన్నె అరుగులపైనే పంచ వన్నెల ముగ్గూలే "
" పంచవన్నెల అరుగులపైనా ఎవరెవరూ పండెరే "
" దేవేంద్రుని కూతుండ్లమ్మ ఏడు మంది కూతుండ్లే "
" నాగేంద్రుని కూతుండ్లమ్మ నాగన్నే లేడుగురే "
" కన్నెలంతా గూడూకోని గంగలోకి ఎల్లీరే "

గొబ్బియాలో సీరాలిప్పి రయికాలిప్పి పిరిమూటలు గట్టిరే గొబ్బియాలో
" వట్టీ పసుపు గొట్టిరి కన్నెలు వసంతాలాడిరి కన్నెలు "
" ముద్దా పసుపు గొట్టిరి కన్నెలు మునిగి
తానాలాడిరి కన్నెలు "
" పొన్నామానిలో చిన్నీ కిష్టా పొందుగా విలచెనే "
" చీరాలెత్తి రయికాలెత్తి పొన్నమానే జేరేనే "
" చీరా మూటాలెల్ల కిష్టుడు పొన్నమాను ఎక్కేనే "
" వందారీకి చిన్న కన్నె సీరా మూటలు చూసేనే "
" వక్కాలారా వక్కాలారా సిరి మూటాలేయిగా "
" పొన్నామానిలో చిన్నాకిష్టా పక పకా నవ్వేనే "
" వందారీకి చిన్నా కన్నె పొన్నమానే చూసేనే "
" వక్కాలారా వక్కాలారా పొన్నమానే జూడారే "
" సుట్లాగాలి వచ్చెనేమొ సుట్టుకోనీ పోయానేమొ "
" సుట్రాగాలి రాలేదక్కా సుట్టుకోనీ పోలేదే "
" ఎర్రగాలీ వచ్చానేమొ ఎత్తుకోనీ పోయానా "
" ఎర్రగలీ రాలేదక్కా ఎత్తుకోనీ పోలేదే "
" అకుదోటా మరుగున కిష్ణుడు అనిగనిగీ వచ్చెనూ "
" సెరకూదోట మరుగున కిష్ణుడు చెలరేగీ వచ్చెనూ "
" పొన్నమానిలో చిన్నా కిష్ణుడు పొందూగా విలచేనూ "
" వక్కాలారా వక్కాలారా పొన్నమానే జూడారే "
" పొన్నమానిలో చిన్నా కిష్టా పకున్న నవ్వేగా "
" కన్నెలారా కన్నేలారా దండములు బెట్టరే "
" పారూటాకులు పెరికిరి కన్నెలు పైటలమర ఏ సీరే "
" తేరూటాకులు పెరికిరి కన్నెలు తెరలమర గట్టీరే "
" వంటిసేతి దండములే బెట్టినారే కన్నెలూ "
" వంటిసేతీ దండములేవప్పితామే లేదుగా "
" రెండూ సేతీ దండాములే పెట్టినారే కన్నెలూ "
" వారి వారి సీరాలైనా వారి వారీకిచ్చాగా "

గొబ్బియాలో  వారి వారి రయికాలైనా వారికైనా యిచ్చానే  గొబ్బియాలో
"  పొన్నమానిలో చిన్నికిష్టా మాయములే ఆయగా  "

ఒక జక్కిపాటలో కృష్ణుడు పదినెలల బిడ్డతల్లి ఇంటికి వెల్లి తలుపు తీయమంటాడు. కానీ ఆమె తీయదు, చివరికి ఆమె అత్త పసిగడుతుందని మల్లు పట్టుకొని కల్లెగిరి దూకి వచ్చినట్లుగా వర్ణించ బడింది.

గంధమో పిరిగంధమో గెడిదీయె ఓభామా గడిదీయెభామా గంధమో పిరిగంధమో
" గెడికాడ గంధపు పెక్కలుండాయిరా "
" నట్టింట పందేమ గడిదీయెభామా "
" నట్టింట నాగేంద్ర పడి గెలుండాయిరా "
" తలకాడ పందేమ గెడిదీయెభామా "
" తలకాడ తల్లిసాకిన కుర్రులుండాయిరా "
" సేతల్లో పందేను గెడిదీయే భామా "
" పేతల్లో పెట్టోరి గాజులుండాయిరా "
" పక్కాన పందేను గడిదీయె భామా "
" పక్కన పదినెల్లా బాలుడుండాడురా "
" నాకులేని బాల నీకెందుకిలగా "
" కాలకాడ పందేను గడిదీయె బామా "
" కాలల్లో కంచోరి మెట్టెలుండాయిరా "
" కానీయె ఓ భామా కానీ యెభామా "
" కానీ కాకర చెట్టు కల్ల సుండాది "
" బల్లు బల్లున తెల్లారె గెడిదీయెభామా "
" అన్నెకారికోడి కూసె గెడిదీయె భామా "
" మా అత్త వచ్చేను పోవోయి సామీ "
" మీ అత్త వస్తేను నాకేమి భయమూ "
" రానే వచ్చింది మాయదారి అత్తా "
" మల్లు పట్టుకోని క్రిష్ణుడు కల్లెగిరి దూకే " 6

ఇలా కృష్ణలీలల్ని వర్ణించబడ్డ జానపదగేయాలు ఎన్నో వున్నాయి. వీటన్నింటిలోకి 'పాండురంగ' భజన పాటలు చాలా ప్రత్యేకంగా కనిపిస్తాయి.

కొంతమంది యువకులు కాళ్ళకు గజ్జలు, ఒంటికి ఎర్ర బట్టల్ని కట్టుకొని చేతిలో ఎర్రని జండాలు పట్టుకొని వలయాకారంగా నిలబడుతారు. మేళ నాయకుడు ముందు పాటలో ఒక్కొక్క లైనే పాడుతాడు. ఆతన్నను సరించి మిగిలిన వాళ్ళు అలాగే ఆ పాటను పాడుతూ ఆతని సూచనలను సరించి వంగుతూ లేస్తూ, అడుగులు వేస్తూ శ్రీ కృష్ణుడి పైనా పండరిపురం పైనా పాటలు పాడుతారు. దీన్నే 'పండరిభజన' అంటారు. ఈ సందర్భంగా పాడుకునే పాటలన్నీ 'పండరిభజన పాటలు' అని రాయలసీమలో ఎక్కువ ప్రచారంలో వున్నాయి

ఈ పాటల్లో కొన్నింటిని ఎన్. వి. గోపాల్ అండ్ కో వారు "శ్రీ పాండురంగ బృందావన సంకీర్తనలు" అన్న పేరుతో ముద్రించారు. 7

ఈ భజన కారులు " రంగరారా పండరినాథారారా పండరి భక్తుల మొరాలకించీ వేగారారా" అనీ, పురమూ జూడండీ రంగనీక్షేత్రము జూడండీ" అనీ 'రంగు జండాల భజన రంజమైన రంగన భజన' అనీ పలురకాల పాటలు పాడుకుంటూ పండరి యాత్ర కూడా జరుపుతారు.

వీరు పాడే ఈ పాటల్లో కృష్ణ లీలలకు సంబంధించిన పాటలుకూడా చాలా వున్నాయి వాటిలో "చల్లాలమ్మను పోవుదాము రారే ఓ చేడెలారా", "అమ్మా తనయుని దుడుకులు తెలిపెదమే తల్లీ " వంటి పండరిభజన పాటలు వినని జానపదుడు ఉండడంటే అతిశయోక్తి కాదు.

ఈ పాటల్లో ఎక్కువ పండరి నాయకుని పొగడే వైష్ణవభక్తిని తెలిపే గేయాలే ఎక్కువ, భాగవతాన్ని గానీ, భాగవత ఘట్టాల్నిగానీ వర్ణించే గేయాలు తక్కువ ...

ఒక గేయంలో కరిరాజును కాపాడిన హరి కీర్తించబడ్డాడు. అందులోనే కృష్ణుడికి , రాముడికి అభేదంకూడా పాటింపబడింది.

" నీకే తగురా రంగా నీకే తగురా కృష్ణా
దీనుల రక్షింప బిరుదు దీన దయా దేవ దేవ ॥నీకే॥

కరి రాజునిగాచి ఆశిలను నాతిగజేసి
మారీచుని తెగా వేసి
మహిమతో మాట్లాడిన బిరుదు ॥నీకే॥

పూతను వధీయించీ ఆమునీ యాగముగాచీ
సకల లోక నాయక శుభదాయక రంగనాయకా ॥నీకే॥ 8

## సత్యా కృష్ణులకు సంబంధించిన పాటలు :

నవ వధూవరులకు శోభనం ఏర్పాటు చేసేటప్పుడు జానపద స్త్రీలు రెండు జట్లుగా చేరి కొన్ని పాటల్ని పాడుతారు 'వీటినే శోభనం' పాటలు, తలుపు దగ్గర పాటలు అని వ్యవహరిస్తారు. ఈ తలుపు దగ్గర పాటలన్నీ సంవాదాలే. ఒక జట్టువారు కృష్ణుకి గాను లేదా నరసింహ స్వామిగాను మరో జట్టువారు సత్యగాను, లేదా చెంచులక్ష్మిగాను భావించుకొని పాడుతారు. ఇవి వినేవారికి చాలా యింపుగా మనోరంజకంగా వుండి హుషారును ఆనందాన్ని కలిగిస్తాయి.

ఈ సంవాదాలలో సత్యా కృష్ణులకు సంబంధించిన పాటలే ఎక్కువగా కనిపిస్తాయి. ఈ పాటల్లో సత్యాకృష్ణులు ఎలా చిత్రీకరించ బడ్డారో చూద్దాం.

ఒక శోభనం పాటలో అందరినీ అలరించి అన్ని పనులు ముగించుకొని చివర కృష్ణుడు ప్రియురాలయిన సత్యభామ దగ్గరకు పోతాడు: తొట్ట తొలుత తననే చూడాలనీ, తన చెప్పుచేతుల్లోనే భర్త ఉండాలనీ భావించే ఖండిత నాయిక సత్యభామ. సత్యభామ పట్ల అటు శిష్ట సాహిత్యంలోను, ఇటు జానపద సాహిత్యం లోనూ అఖండితనాయిక లక్షణాలు సలక్షణంగా పోషింప బడ్డాయి.

కృష్ణుడు : తల్లి యశోద తనయుడు నేనిక తలుపులు తియ్యవే భామా
భామా తల వాకిలి తియ్యవే కొమ్మా

సత్య : వాకిలి తీయమని వార్తలు తెలిపేవు
వచ్చిన మగవాడెవ్వరో సామి వచ్చిన మగదెవావ్వరో

కృష్ణుడు : నా ముద్దుగుమ్మరో నిను పెండ్లాడిన
రామ క్రిష్ణులమే భామా రామ క్రిష్ణులమే భామా

సత్య : రామ క్రిష్ణాదులకు రాత్తిరి వేళలో
వచ్చిన పని ఏ మయ్యా రా కారణమేమయ్యా

కృష్ణుడు : పచ్చని దవనము పరిమల గంధము
నీ కంట నేను తెస్తిభామా నేను నిను చూడాలని వస్తి కొమ్మా

సత్య : పచ్చని దవనము పరిమల గంధము నా కంట తెచ్చితే
నను చూడ వచ్చితే భామలకీ పోవయ్యా నువ్వు
భామలకీ పోవోయి

కృష్ణుడు : గండ బేరుండల మృగములు జంపితి
గాసి జెందితి భామా నేను గాసి చెందితిని కొమ్మా

సత్య : గాసి తీర్చుటకు చెంచిత వున్నది
గరుడాద్రికి పోవయ్యా నీవు శేషాద్రికి పోవయ్యా

కృష్ణుడు : దానితో ఎక్కడ దారి తెలియదు
దారి చూపవే భామా నీవు దారి చూపవే కొమ్మా

సతగ : రుక్మిణి యింటికి అటు ప్రక్కనున్నది
దారి చూపితి పోవయ్యా నీవు దాపు చేరు కోవయ్యా''[9]

ఇదే అంశాన్ని తెలిపే మరో తలుపు దగ్గర పాటలో అర్ధరాతిరి చిట పట చినుకుల్లో తడుచుకుంటూ కృష్ణుడు సత్యభామ చెంతకు వెళతాడు. తలుపు తీయ మంటాడు. సత్యభామ తీయదు. చివరికి ''పెళ్ళి కొడుకువై దండాము పెట్టితే తలుపు తీతునోయి'' అంటూ కృష్ణుని దగ్గర దండాలు పెట్టించుకుంటుంది.

కృష్ణుడు : పొడి పొడి చినుకులు చల్ల చలిగాలి వాకిలీ
డియ్యావేభామా నీవు వాకిలి దీయవే కొమ్మా

సత్య : అర్థరేతిరి నిద్దర పొద్దున ఎవరనీ వాకిలి దియ్యదు సామి
నేను ఏమని దీయుదు సామీ

కృష్ణుడు : గోగుల మేపేటి[10] ఆవల మేపేటి గోపేమ్మ కొడుకును
కొమ్మా నేను గోపాల కిష్టునే భామా

సత్య : గోపమ్మ కొడుకువు నీవే అయితే గోపాల క్రిష్ణునీవే అయితే
అర్ధరాతిరి నిద్దర జామున ఇక్కడ పనులు ఏమయ్యా
నీకు ఏమి పనులో సామి.

కృష్ణుడు : సన్న జాజూలు సరములు దెచ్చిన యింగను గైకొను భామా
నీవు యింగను గైకొను కొమ్మా

సత్య : సన్న జాజులు సరములు దెచ్చి భామలకీ పోవోయి
సేదెల కీ వోయి సామీ సేదెల కీపోవోయీ

కృష్ణుడు : మంచి మల్లెలు సరములు దెచ్చినా యింగను గైకొను
భామా నీవు యింగను గయికొను కొమ్మా
దగ దగ మెరిసేటి దంతపుగాజులు నీ కంటనే దెస్తినే
భామా విన్ను జూడ వస్తినే కొమ్మా
విగ విగ మెరిసెటి నీలపగాజులు నీ కంటనే తెచ్చినానో
భామా నీకంటనే దెస్తినే కొమ్మా
సెండు మల్లెల సెండ్లు దెచ్చినా బండూ మల్లెల
బత్తులు[11] దెచ్చినా యింగను గైకొను
భామా నీవు యింగను గయికొను కొమ్మా

సత్య : సెండ్లి కొడుకువై దండాము బెట్టితే వాకిలి తీతునో సామీ
నేను వాకిలి తీతునోయీ[12]

అలాగే మరో శోభనం పాటలో శ్రీకృష్ణుడు దేవలోకం పోయి దేవ గన్నేరంటులు దెచ్చి తలలో ముడుచుకోమని ఇస్తాడు. అయినా ఆమె వప్పుకోదు. భూదేవినడిగి బొజ్జ గన్నేరంటులు తెచ్చాను పెరట్లో నాటుకో అంటాడు. ఇదంతా పారిజాతాపహరణ ఘట్టాన్ని తలపింప చేస్తుంది. పైగా ఈ దేవగన్నేరు, బొజ్జ గన్నేరే పారిజాతవృక్షాలేమో అని కూడా అనిపిస్తుంది.

"వచ్చా వచ్చాని మానీకిదా వచ్చారేణీ మానీకీదా
ఉంగారాలూ ఆడే సఖియా – బంగారాలు వాడే సఖియా
రంగు మీరిన దేవతలున్నారూ ఆ మానీ కీద
తాటిమానీ విలవూకన్నా - తాటిమానూ సువ్వాసనలు
మానులెక్కీ మందలు మరుపోయి ఓ గోపాలాసామీ
దేవేంద్రుని వరదకు [13] పోయి దేవేంద్రుని వరముల డిగ
దేవగన్నేరంటులు దెచ్చిండా ఓ సత్యభామా
ముడిచుకోవే నితోటాలోగ
భూదేవుని వరదకు పోయి బొజ్జ గన్నేరంటులు దెచ్చిండా
ఓ సత్యభామా నాటుకోవే నీతోటలాగా" [14]

## లక్ష్మీ నరసింహులకు సంబంధించిన పాటలు :

హిరణ్యకశిపుని ముద్దు కుమారుడు ప్రహ్లాదుడు. హిరణ్యకశిపుడు శివ భక్తుడు. అంతకు మించి హరివైరి. హరి పేరు వినబడితే చాలు మండిపడతాడు అలాంటి వాడికి ఉత్తమ హరిభక్తుడైన ప్రహ్లాదుడు పుట్టాడు. వయసులో పిన్నయినా ప్రహ్లాదుడు హరిభక్తిలో అందరి కన్న మిన్న. ఎంత చెప్పిన హరి స్మరణ మానడు ప్రహ్లాదుడు. దాంతో కాలసర్పాల చేత కాటు వేయిస్తాడు మదపుటేనుగుల చేత తొక్కిస్తాడు. ఎన్ని హింసలు పెట్టినా ఏం చేసినా ప్రతిసారి శ్రీహరి అతన్ని ఆదుకుంటు వస్తాడు. దాంతో ఆ బాలుడిలో భక్తి యింకా ఎక్కువవుతూనే ఉంటుంది. చివరికి ఆహరి నరసింహావతార మెత్తి హిరణ్య కశిపుని చంపి ప్రహ్లాదుని రక్షిస్తాడు ఆసమయంలో ఆశ్రీలక్ష్మే చెంచులక్ష్మిగా

పుట్టి నరసింహున్ని వరిస్తుంది. ఈ లక్ష్మీ నరసింహుల పైన జానపదుల ఎన్నో పాటలు కట్టి పాడుకున్నారు. అలాంటి వాటిలో లక్ష్మీనరసింహుల సంవాదాలు కొన్ని ఇక్కడ చేర్చడం జరిగింది.

ఒక తలుపు దగ్గర పాటలో నరసిహస్వామి తన ఉగ్రత్వం ఆపుకోలేక దేశ దిమ్మరై తిరుగుతుంటాడు.

ఆ ఉగ్రత్వం తగ్గాలంటే.... ఇక లక్ష్మి ఒక్కటేగతి అయిది. అక్కడికీ లక్ష్మి ఎన్నో చెబుతుంది. అయినా తన్ను వదిల 'సాగదోల' మంటాడు. నరసింహస్వామి. వారిద్దరి ప్రేమకు చిహ్నంగా సాగే ఈ సంవాదంలో లక్ష్మి నరసింహుల వైనం రసరమ్యంగా చిత్రీకరించ బడింది.

నర : అలుగుట ఫలమేమే లక్ష్మీ యిందువత్తువేగా
చలములేలనే సాగదోలవే సన్నుతి చేసెదను

లక్ష్మి : సాగదోలుటేమి సాలును లక్ష్మిస్నేహంబు
బాగుగా వ్రాసిన బ్రహ్మ వ్రాతయు బాపలేను స్వామీ

నర : బ్రహ్మ వ్రాయుటేమి లక్ష్మీ పగ ఎందుకు నాతో

లక్ష్మి : దిమ్మరినీవై దేశములన్ని చిరగమరిగి నాపు

నర : దిమ్మరినేనైతే చెలియ తిన్నగానీ కెవరే
సమ్మతితోడుత సాగదోలవే స్వామి సాక్షిగను

లక్ష్మి : ఉన్నవారి పేరునీవు తిన్నగవినవయ్యా
ఎన్ని చెప్పిన వారితో మీరు గెలువలేరు స్వామీ

నర : నన్నుమించినోడు చెలియ జగతిలో వున్నాడా
చెమ్మ మీరగ చక్రముతోటి ఖండించెద వినుము

లక్ష్మి : నీలి వర్ణుడయ్య దేహము నీరాజాక్షుడయ్యా
పాలమందాన కస్తూరి తిలకము బాగుగ మెరియగను

నర : అంతపాటి వాడానామము అతివరో చెప్పవే

బొంకు లేకను నిజము చెప్పవే పంకజాక్షి నాతో

లక్ష్మి : కోటి సూర్య కాంతి మెరయమేటి కిరీటము

హటకమునుబ శంక చక్రములు అమరిదిద్దియుండు

నర : ఇట్టివాడు చెలియ నీకు ఎన్నడు కలిగెను

పట్టి వధించితె కన్నుబడితే పారిపోక నీవు

లక్ష్మి : పారిపోయె వారు కాదు పరమాత్ముండతడు

మారముజాడు గెలువలేరు మీరు దుడుకులన్ని పోను

నర : వనితరో నీవెంతోనేను ప్రతి వరతను కొంటి

గడిగి యుద్ధము నాతో చేసెడి కాంతుడంటె నీకు

లక్ష్మి : చిత్తమంత మనసు నీకు చెంచలమైనాది

మత్తుకెక్కిన భద్రాదీనుక వాదమేలనాతో''[15]

పై పాటలో తన ప్రియుడిగా శ్రీకృష్ణుదిని దృష్టిలో పెట్టుకొని లక్ష్మి దేవి నరసింహస్వామికి చెప్పినట్లు గ్రహించవచ్చు. ఇక్కడ శ్రీకృష్ణ నరసింహులు ఒక్కటేనన్న భావనను లక్ష్మి కలిగించిందని అర్థం.

మరోపాటలో నరసింహస్వామి పర స్త్రీలతో కలిసి ఆ చిహ్నాలతో అలాగే లక్ష్మిదగ్గర కొస్తాడు. ఆ చిహ్నాల్ని బట్టి ఆతన్ని అను మానించిన లక్ష్మీదేవి నిలదీస్తుంది, ఆ సమయంలో ఆతను చెప్పిన సమాధానాలు ఆతన్ని దక్షిణ నాయకునిగా నిలబెడతాయి.

నర : పరులు విడచి రాగ చూసి తలుపులేసే విధము ఏమి

పరులుగానే మదికే దోసేనా ఓ - లచ్చిమిదేవి

పరులుగానే మతికే దోసేనా

లక్ష్మి : యాటలంట [16] నీవె బొయ్యి ఎవతితోనో కూడూకోనీ
మాయ బొంకూలేలా బొంకేవూ - ఓ నారసింహా
మాయబొంకులేలా బొంకేవూ
మాటలంటానువ్వే బొయ్యి - వల్లంతా వసుపూలేడి[17]
ఓ నారసింహా మాయబొంకూలేలా బొంకేవూ

నర : గొప్ప గొప్ప కొండలనడుమా - దారి తప్పొయ్యి యాటాడ బోతే
మాతకపూలే[18] అధికంగ బూసిందే - ఓ లచ్చిమీదేవీ
పూలు చీట్లీ వసంత మాయేనా - చల్లినట్లే వసంత మాయేనే
అగ్గిని ముట్టి వాన తెచ్చీ [19] పాముని ముట్టి బాసచేసీ
నీళ్ళతోనా నిజమే తెలిపేనా ఓ - లచ్చిమి దేవీ
నిన్ను తప్ప యితరుల నెరుగానే

లక్ష్మి : అగ్గిని దేవుడు ఆత్మ బంధువు పాముదేవుడు ప్రాణనాథుడు
నీళ్ళల్లో నా నిజమే తెలిపేవా ఓ నరసింహా
మాయబొంకూ లేలా బొంకేవూ యాటలంటానువ్వే బోయ్యి
గముకుడ [20] ఏడుగురి చెంచులజడలదాచీనావా
ఓ నారసిమ్మా మాయ బొంకూ లేలా బొంకేవూ''[21]

ఇలాగే సాగే మరో శోభనం పాటలో వేటకు వెళ్ళి తిరిగి వచ్చిన నరసింహ స్వామిని చూసి ఆదిలక్ష్మి తలుపులు బిడాయించి పడుకుంటుంది. ఆ తలుపులు తీయమని నరసింహుడు ఆమెను వేడుకుంటాడు. వారి మధ్య జరిగిన సంభాషణ ఇదీ.

నర : కలికి వాకిట బంధనవేసిన కారణమేమే భామాలక్ష్మీ
కారణమేమే కొమ్మా

లక్ష్మి : కారణమేమని అడిగేవు నీమది తెలియగలేదట వోయీ సామీ
తెలియగలేదట వోయీ

నర : తెలిసో తెలియక చెంతను చేరితి పంతములేటికి బొమ్మా
నాతో పంతములేటికే కొమ్మా

లక్ష్మి : పంతములేటికి పరమాత్మానాతో పొందకద్దు[22] పోవోయీ
పొందరవద్దు పోవోయీ

నర : ఆ కరిమేఃక[23] గండ మృగములు కూల్చి వచ్చితినిభామా
నేను గాసి చెందితిని కొమ్మా

లక్ష్మి : ఆ గాసి[24] తీర్చుటకు చెంచిత యున్నది గరుడా
దిగి పోవోయి సామి గరుడా దిగిపోవోయి

నర : పచ్చటి దవనము పరిమళ గంధము భామలకీ పోవోయిసామి
వనిత కీ పోవోయి''[25]

ఇలా కృష్ణుడితో బాటు నరసింహస్వామిని కూడా జానపదులు దక్షిణ నాయకుణ్ణి చేసారు.

నరసింహ స్వామికి సంబంధించిన సంవాదాల్లోనే గాకుండా స్తంభజుడైన నరసింహస్వామిని ఒక భజన పాటలో నోరార పాడి భజించారు జానపదులు.

''శ్రీవేంకటేశ్వర సిరికొండవాస రావయ్య - రాగదే రఘురామచంద్రా
మందరగిరి వాసమహనీయ వాస పొంగుచు నిను తలతుభోనగిరిదేవ
స్తంబాద్రి నరసింహ్మసర్వజన పోష కుంభినీ నాథుడ గుంటగిరినాధా
సత్యగిరి నరసింహ సత్యగిరిదేవా
హెచ్చుగా పలకేటమేలు కొండయ్య ధర్మపురి నరసింహా
తరిగొండవాన నిర్మలగుణశీల నీలగిరి స్వామీ....''[26]

## సూచికలు

1. మంగిరి రాజమ్మ. కురవపల్లె, పులిచెర్ల మండలం, చిత్తూరుజిల్లా.

2, 3. ఈ పాటలు పాడినవారు. కె. మద్దయ్య, నూనెపల్లె, నంద్యాల కర్నూలుజిల్లా.

4, 5. ఈ పాటలు సేకరించి యిచ్చినవారు:— రాసాని చెంగల్రాయుడు, కురవపల్లె, పులిచెర్ల మండలం, చిత్తూరుజిల్లా.

5. పాలనిండ్లు < పాలిండ్లు

6. పాడినవారు టి. భాగ్యమ్మ, మడకశిర, అనంతపురంజిల్లా.

7. చూడుము. శ్రీ పాండురంగ భజన కీర్తనలు - ఎస్. వి. గోపాల్ అండ్ కో (1983)

8. పాడినవారు. జె సుబ్బరాయుడు. గొల్లకంద్రిగ. పుత్తూరు తాలూకా, చిత్తూరుజిల్లా.

9. పాడినవారు. సావిత్రమ్మ, బూచెర్ల, రొద్దం మండలం అనంతపురంజిల్లా

10. గోగులు < గోవులు

11. బత్తులు < బంతులు

12. పాడినవారు. జి. రాధమ్మ, ఎమ్మిగనూరు. కర్నూలుజిల్లా

13. వద్దకు > వరదకు

14. పాడినవారు, పోతానిరాజమ్మ, కురవపల్లె, పులిచెర్లమండలం చిత్తూరుజిల్లా

15. పాడినవారు. శివలక్ష్మమ్మ, బనగానిపల్లె, కర్నూలు జిల్లా.

16. వేట > యాట

17. పసుపు అంటుకున్న గుర్తులు

18. మోదుగపూలు > మాతకపూలు

19. ఆనతిచ్చి > వానతెచ్చి

20. గముకుడు = కాముకుడు, మోసగాడు

21. పాడినవారు. వెంకటమ్మ, కదిరాయచెరువు పిచ్చగుంట్లపల్లె, వాయల్పాడు తాలూకా, చిత్తూరుజిల్లా.

22. పొందరవద్దు < పొందు వద్దు

23. ఆకరిమృగము > ఆకరిమేగలము = ఆ మదపుటేనుగు

24. గాపి = అలసట

25. పాడినవారు. వి, సుబ్బమ్మ, కమలాపురం, కడపజిల్లా.

26. పాడినవారు. యన్. వెంగమ్మ, బేతంచెర్ల, డోన్ తాలూకా కర్నూలుజిల్లా.

# ఇతరాలు

రామాయణ భారత భాగవతాలలోనే గాకుండా ఇతర పురాణాలలోను, కావ్యాలలోను ప్రసక్తమైన పౌరాణిక సంబంధమైన అంశాలున్న గేయాలను ఇందులో పరిశీలించడం జరిగింది.

ఇందులో హరిశ్చంద్రోపాఖ్యానం, జానపదగేయాలలో వేంకటేశ్వరుడు, గోవ్యాఘ్ర సంవాదం వంటివి చేర్చడం జరిగింది.

## హరిశ్చంద్రోపాఖ్యానం :

కరుణరసభరితమైన కథ హరిశ్చంద్రోపాఖ్యానం వేదాలలో చెప్పబడిన సత్యనిరతికి కావ్యానుకృతి హరిశ్చంద్రుని కథ. ఇది మార్కండేయ పురాణంలోను [1] భారతంలోను [2] వున్నదే.

వసిష్ఠ విశ్వామిత్రులు పంతంతో ఆడుకున్న చదరంగంలో పావులుగా నిలిచారు హరిశ్చంద్రుడు, చంద్రమతి, లోహితుడు. వసిష్ఠునితో పోటీపడిన విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని అష్టకష్టాలపాలు చేస్తాడు. తన యాగానికీ యిస్తానని బకాయి పడిన ధనాన్ని రాబట్టడానికి నక్షత్రకుణ్ణి వెంట పంపుతాడు విశ్వామిత్రుడు కట్టుబట్టలతో ఆలుబిడ్డలతో కాశికి బయలుదేరుతున్న హరిశ్చంద్రుని, నక్షత్రుకుడు పెట్టిన బాధలు అన్నీ యిన్నీ కాదు. క్షణానికొక గండం, నిముషానికో ఆపపాతం సృష్టిస్తాడు. ఆరు చెరువుల నీళ్ళు తాపకనే అల్లల్లాడిస్తాడు.

ఆతను పెట్టిన బాధలు ఒక జానపద గేయంలో శిష్ట సాహిత్యంలో కంటే భిన్నంగా చిత్రీకరించ బడ్డాయి.

మాటి మాటికీ దాహమంటూ, అడుగడుక్కీ ఎత్తుకోమంటూ వేధించే నక్షత్రకుడు, అలా చేయని పక్షంలో హరిశ్చంద్రుణ్ని కొట్టి తిట్టేవాడుగా అతి కఠినాత్ముడుగా ఈ పాటలో చిత్రీకరించ బడ్డాడు. ఇది ఒక దృష్టి కోణం. నాణేనికి రెండు వైపులా విలువున్నట్లే మరోవైపు నుంచీ చూస్తే హరిశ్చంద్రుని ఓర్పు ఔదార్యం సత్యనిరతి ఎంతటిదో ఆస్థితిలో ఆతని కుటుంబ పరిస్థితి ఏమిటో కూడా ఈ గేయంలో గమనించ వచ్చు ఇది రెండో దృష్టి కోణం. ఇదొక చెక్క భజనపాట. ఇందులో నక్షత్రకుడి బాధ భరించలేక హరిశ్చంద్రుడు ఆతన్ని వేడుకునే వైనం హృదయ విదారకంగా కనిపిస్తుంది.

"కొట్ట వలదు బ్రాహ్మణయ్య పట్టెదానీ పాదము
కొట్టితే పైకంబు వచ్చునా గోరమైన అడవిలో
గడియగడియకు నన్నిట్లు కొట్ట వలదు బ్రాహ్మణా ॥ కొట్ట ॥

కాశీ పట్నము పోయి పైకము గ్రక్కున యిట్టిస్తము
దాహమిక్కుని సారి సారిగ దారికడ్డమురాకదే
దాహమునకై లోహిదాసుడు కండ్ల నీరుంచెను ॥ కొట్ట ॥

యింత దూరము మోసి తెచ్చితి కొంతదూరము నడువుమూ
మోసి మోసి దేహమంత గాసి చెందెను బ్రాహ్మణా
అదిగో చూడుము బ్రాహ్మణా అల్లదిగో కాశీపట్నము ॥ కొట్ట ॥

మెల్లగ పదిబార్ల దూరము నడుమయ్య బ్రాహ్మణా
కాశి గంగ తీర్థమందు సాన్న సంధ్యలు దీర్చియు
ముదముతో ఆకాశ నాథుని మోదమున జపియింతము³ ॥ కొట్ట ॥

ఇలా ఎన్నో బాధలనుభవిస్తూ హరిశ్చంద్రుడు భార్యాపిల్లలతో కాశీ పట్టణం చేరుకుంటాడు. అక్కడ కౌశికుడనే బ్రాహ్మడికి ఆలు బిడ్డల్ని అమ్మి తనూ ఓ కాటి కాపరికి అమ్ముడు పోయి నక్షత్రకుడి అప్పు పైకం తీరుస్తాడు హరిశ్చంద్రుడు. అయితే ఎంత ప్రయత్నించినా భార్యా పిల్లల్ని మాత్రం అతను తిరిగి పొందలేక పోతాడు.

ఆయితే కాశికుడి ఇంట్లో తల్లితోబాటుగా అనేక బాధల్ని అనుభవిస్తున్న లోహితాస్యుడు [4] సమిధల కని అడవికి పోతాడు. అడవిలో ఒక పుట్టపైన సమిధను సేకరిస్తుండగా కాలనాగు కాటుకు గురవుతాడు. ఇది కూడా విశ్వామిత్రుడి మాయే. ఆ సమయంలో లోహితుడు ఆ బాధ భరించలేక విలపించిన తీరు జానపదుల కంటతడి పెట్టించింది

ఇది కూడా ఒక చెక్క భజన పాటే.

"ఆహా నాపాపి దైవమా సర్పంబుకరచెనా
అడవిలో సర్పంబుకరచి అధిక బాధ ఎక్కువాయ
కాననమున దిక్కులేరయ్యా ॥ఆహా॥

పుట్ట మీద కాలుపెట్టి నిక్కి ఆకులు కోయుచుంటే ....
వచ్చికాలు బట్టి కరచెనా - అడవిలో సర్పంబు కరచి
అధిక బాధ ఎక్కువాయు కాననమున దిక్కులేరయ్యా ॥ఆహా॥

నోయరాని నోము నోచి నన్ను కన్నాది తల్లి
నోము ఫలము ఎటులపోయెనా అడవిలో సర్పంబుకరచి
అధిక బాధ ఎక్కువాయ కననము మాకు దక్కులేరయ్య ॥ఆహా॥

నాదు మరణ వార్త తెలిసి తల్లి కెవరు తెలిపేవారు
కాననమున దిక్కులేరయ్యా అడవిలోన సర్పంబు కరచి
అధిక బాధ ఎక్కువాయ కాననమున దిక్కు లేరయ్యా[5] ॥ఆహా॥ "[5]

# జానపదగేయాలలో వెంకటేశ్వరుడు

తిరుమలగిరి వాసుడైన ఆ శ్రీనివాసుడే వేంకటేశ్వరుడు. యావద్భారతావనికి తిరుమల వెంకన్న కలియుగ దైవం. భక్తుల కోరికలు తీర్చి, ఆర్త ప్రాణుల్ని రక్షించే ప్రత్యక్ష దైవంగాను వడ్డీ కాసుల వాడిగాను నిత్య పుజలందుకుంటున్న ఆ శ్రీనివాసుడు ఆంధ్రుల కల్ప తరువు.

వేంకటేశ్వరుడు కూడా పురాణ పురుషుడే. వెంకటేశ్వరునికి జరిపే ఉత్స వాలలో బ్రహ్మోత్సవాలు చెప్పుకోదగ్గవి. వెంకటేశ్వరుడుకి లాగేనే అతనికి జరిపే ఉత్సవాలను ఆ బ్రహ్మదేవుడే ప్రారంభించినట్లు పద్మ పురాణంలో చెప్పబడింది

"మాసే భాద్రపదే విష్ణుతిధే విష్ణు సమన్వితే
సిద్దయోగ సోమవారే శిరే నారాయణాహ్వయే
స్వామి పుష్కరిణీ తీరే పశ్చిమే భూత్యా పశ్చిమే
బృందార కాణాం బృందైస్తు ప్రార్థతో లోక రక్షకః
ఆవిర్బ భూవ భగవాన్ శ్రీనివాస్య పరః పుమాన్
తస్యశ్రీ వేంకటేశస్య బ్రహ్మలోక పితామహః
చకరనా మాస్యే తుధ్వజరోహ మహోత్సవం"[6]

వరాహ పురాణంలోను ఇదే అంశం ప్రస్తావించ బడింది. ఈ ఉత్సవాల వివరాలను గూర్చి ఎందరో పరిశోధనలు కూడా చేశారు.[7]

శిష్టుల్నే కాదు ఈ వెంకటేశ్వరుడు జానపదుల్ని కూడా ప్రభావితం చేశాడు కాబట్టి వేంకటేశ్వరునికి సంబంధించిన గేయాలు ఎన్నో వున్నాయి. పరిశీలనా సౌలభ్యం కోసం ఈ గేయాలను ముక్తకాలు, కధాత్మకాలు అని రెండు విభాగాలు చేసి పరిశీలించవచ్చు,

## 1. ముక్తకాలు :

చిన్న చిన్న గేయాలు ముక్తకాలు. ఈ ముక్తకాలలో వెంకటేశ్వరుడు ఎలా చిత్రీకరించబడ్డాడో పరిశీలిద్దాం. ఒక హారతి పాటలో వెంకటేశ్వరుడు వైకుంఠ వాసుడిగా, కారుణ్యగుణనిధిగా వర్ణించ బడ్డాడు.

"శ్రీవేంకటేశునకు శృంగారలారునికి వైకుంఠవాసునికి
వరదునికినూ, కంతాలిదవళించు కారుణ్య
గుణనిధికి కరుణించు శ్రీ వెంకటేశునకూను
జయమంగళం రామ శుభ మంగళం"[8]

అలాగే ఒక కోలాట పాటలో గోవిందా అంటే పలికే చోద్యాల దేవుడిగా వెంకన్న కీర్తించ బడ్డాడు.

"ఎన్ని సోద్దాల[9] యంగటన్న ఓరామ
ఎగువ తిరుపతిపైని యెంగటన్నా ఓ రామ
గోవిందా యంటే పలుకుతాడురా ఓరామ
గోవులను గాసిన్న గోవిందుడే ఓరామ
నల్ల నల్లానివాడు యెంగటన్న ఓరామ
నామాలు పెట్టుకున్న నల్లనయ్య ఓరామ
తిరుపతికి పోతానే పలుకుతాడు ఓరామ
కుప్పయావలన్ని[10] కూలగొట్టు ఓరామ ....
దాగల్లవడపప్పు దండి బెల్లాలు ఓరామ
మండిగల దీపాలు ముంచెనెయ్యి ఓరామ
తిరుపతి బోయేటి చిట్టి దాసరికి ఓరామ
తిరువెంగళప్పనికి ఫణతులెందరో ఓరామ
పెద్దామే నాంచారు లోకమాత ఓరామ
అయ్యవారికి సక్కనిది అలుమేలు మంగ ఓరామ" [11]

పై గేయంలో వేంకటేశ్వరునికి ఢిల్లీ పచ్చావ్ కూతురు బీబీనాంచారు పెద్దభార్య అనీ, అలివేలు మంగమ్మ రెండో భార్య అనీ చెప్పబడింది. బీబీనాంచారును పెళ్ళాడిన వెంకటేశ్వరుని కథలు ఎన్నో ప్రచారంలో ఉన్నాయి. (అందులో ఒక కథ ఈ పాటల్లోనే తర్వాత పుటల్లో చూడండి.)

వెంకటేశ్వరుని భక్తులు హుండీలో డబ్బులు, నగలు వేస్తుంటారు. తలనీలాలు అర్పించు కుంటూ వుంటారు. కొందరు పల్లీయులు గొర్రెల్ని, మేకల్ని, పొట్టేళ్ళను దేవుడి పేరుతో వదలి వాటిని అమ్ముకొని ఆ డబ్బుతో ఇంటిల్లి పాదీ బయలు దేరి తిరుమలకు తీర్థయాత్రచేసి దేవున్ని దర్శించుకుని వస్తుంటారు. ఇలా యింటల్లపాదీ కొండకు బయలుదేర డాన్నే 'ఇల్దీర్థం' అని అంటారు ఇలా ఆలు బిడ్డలతో వెళ్ళి మాటి మాటికీ గోవిందా గోవిందా అంటూ కొండనెక్కి, దేవున్ని గాలిగోపురాన్ని చూస్తే మానోవ్యాకులం తీరుతుందని జానపదులు నమ్ముతారు' అంతే గాకుండా దేహవిముక్తికి ఇహపర సౌఖ్యాలకు తలనీలాలర్పించి, వడ్డి కాసులు వేసి వైకుంఠవాసున్ని దర్శించుకోవాలని కూడా ప్రతి జానపదుడు భావిస్తాడు. కాబట్టి ఇహపర సుఖాలనిచ్చే వైకుంఠవాసుదే నిజమైన ముక్తి ప్రదాతగా ఒక చెక్కభజన పాటలో వర్ణించడం జరిగింది.

''మోహన రూపం చూడాలంటే దేహవిముక్తికి పోవాలంటే
ఏడుకొండలు యెక్కాలోయ్ అన్నా రంగన్నా
మన ఎంకటేశునే చూడాలోయ్ అన్నా రంగన్నా
వడ్డి కాసులను మూట గట్టుకొని పిడికెడు రూకలు చేత బట్టుకొని
సతీసుతులను వెంటబెట్టుకొని ఏడుకొండ లెక్కాలోయ్
అన్నా రంగన్నా ॥మోహన॥

మోకాళ్ళ మెట్లను ఎక్కవలంట మనసులోదేవుని తలవాలంట
మనోవ్యాకులమెల్ల పారిపోవునంట ఎండి కొండల నెక్కాలోయ్
అన్నారంగన్నా ॥మోహన॥
గాలిగోపురము చూడాలంట కాలదేవుని ప్రార్థించ వలనంట
ఇహపర సుఖములు మనకు కలుగునంట గోవిందా గోవిందా అనుచు
ఏడుకొండా లెక్కాలోయ్ అన్నా రంగన్నా
కల్యాణ కట్టకు పోవాలంట తలనీలాలు ఇయ్యవలనంట
దేవుని ఏమొ చూడాలంట గోవిందా గోవిందా యనుచు

ఏడు కొండలెక్కాలోయ్ అన్నా రంగన్నా ॥మోహన॥
మంగళమూర్తికి హారతులెత్తి మంగళాత్ముని మనసున తలచి
శృంగార పురుషుని సేవ యొనర్చి ముదముతో అందరు
పాటలు పాడుచు ఏడుకొండ లెక్కాలోయ్ అన్నా
రంగన్నా ॥మోహన॥[12]

ఈ పాట 'ఏరువాకా సాగారోరన్నా చిన్నన్న' అన్న సినిమా పాటకి అనుకరణలా కనిపిస్తుంది.

## కథాత్మకాలు :

వెంకటేశ్వరునికి సంబంధించిన కొన్ని కథాగేయాలు కూడా ఉన్నాయి. కాస్తంత కథ వున్నవన్నీ కథాత్మకాలే. వాటిలో ముఖ్యమైనవి.

1, బయన్న ఎద్దును కొన్న వెంకటేశ్వరుడు.

2, మంగహూరు వేషం.

3, చిన్న బీబును పెండ్లాడిన వెంకటేశ్వరుడు.

## 1. బయ్యన్న ఎద్దును కొన్న వెంకటేశ్వరుడు :

వెంకన్న తన భక్తులను మారు వేషాల్లో వచ్చి ఏదో విధంగా ఆదుకొని తన కొండకు తనే రప్పించు కుంటాడని జానపదుల నమ్మకం. ఆ నమ్మకాన్ని ఆధారంగా చేసుకొని అల్లిన గేయం ఇది. ఇందులో బయ్యన్న అనే బాలుడు వేంకటేశ్వరుని పేరుతో వదలిన తన ఎద్దును అమ్మి ఆ సొమ్ముతో కొండకు వెళ్ళి స్వామిని దర్శించి రావాలను కొంటాడు. అతని కోరికను తెలుసుకున్న ఆపద్బాంధవుడైన శ్రీనివాసుడు బేరగాడి వేషంలో వచ్చి బయన్న ఎద్దును కొంటాడు; అప్పుడు వారి మధ్య జరిగిన బేరసారాలు ఎంతో అతిశయంగాను రసవత్తరంగాను సాగుతాయి. ఇదొక జక్కిపాట.

స్వామి : బాలుడా బయ్యన్న ఉయ్యాలో నీ ఎద్దు బేరము చెప్పు ఉయ్యాలో

బయ్యన్న : నా ఎద్దు బేరమో సామీ ,, నీవు కొనలేవు నా సామి ,,

స్వా : కొంటారా బాలుడా ,, నీ ఎద్దు బేరము చెప్పు ,,

బ : మూతి ముప్పై వేలు సామి ,, నువ్వు కొనలేవు నా సామి ,,

స్వా : కొంటారా బాలుడా ,, నీ ఎద్దు బేరము జెప్పు ,,

బ : కొమ్ము కోటేలు జేసు ,, నీవు కొనలేవు నా సామి ,,

స్వా : కొంటారా బాలుడా ,, నీ ఎద్దు బేరము జెప్పు ,,

బ : తోక తొంబై వేలు సామి ,, నీవు కొనలేవు నా సామి ,,

స్వా : కొంటారా బాలుడా ,, నీ ఎద్దు బేరము జెప్పు ,,

బ : ఇస్తాను నాస్వామి ,, రొక్కము జెల్లించు ,,

అంతం రొక్కంబోసి ,, సామి పట్నాడు ఎద్దునూ ,,

బాలుడే బయ్యన్న ,, అందనే రొక్కమే ,,

బంగారి బెత్తమే ,, ఎండిడి చెలకోడి ,,

బంగారి పగ్గమేసీ ,, ఎద్దునే ఎలదీశా ,,

ఏడేడు కొండలకు ,, ఎద్దునే ఎలవెక్కె ,,

ఎద్దునే ఎలవెక్కె ఉయ్యాలో కొండనే వదిలేశ ఉయ్యాలో [13]

వచ్చేటి కాపులే ఉయ్యాలో ఎద్దునే పూజ చేయుదురు ఉయ్యాలో

## 2. మంగ మారువేషం :

శ్రీ కృష్ణుడు, నరసింహుడు, వెంకటేశ్వరుడు జానపదుల దృష్టిలో శృంగార దేవుళ్ళు. దక్షిణ నాయకులు.

ఒక గొబ్బిపాటలో వెంకటేశ్వరుడు వేటకు వెళ్ళి పరస్త్రీ వ్యామోహంలో పడతాడు. ఆతని గుట్టు రట్టు చేసి స్వామిని తన చెప్పు చేతుల్లో పెట్టుకోవడానికి అలివేలు మంగ మారువేషం వేస్తుంది. ఆ కథ ఇలా సాగుతుంది.

అలివేలు మంగే పద్మావతీదేవి. ఆమెతో కలసి శ్రీనివాసుడు వేటకు వెలతాడు, అవనంలోకి వచ్చిన 'వనకోకిల' లను వనపాలకులు పట్టి యివ్వగా స్వామి వాటిని అలివేలుమంగ కిచ్చి పెంచమంటాడు. దానికి ప్రతిగా మంగ తనను కాదన పరస్త్రీని కన్నెత్తి చూడనని బాసలివ్వ మంటుంది. స్వామి సరే నంటాడు, ఆ తర్వాత ఒక్కడే వేటకు వెలతాడు. ఆతన్ని పరీక్షించాలని మంగ మారువేషం వేస్తుంది, స్వామి ఆమెను మంగగా గుర్తించక ప్రేమలో పడి స్వామి చెవిపోగుల్ని, వేలి ముద్రికల్ని ఆమెకు ఇచ్చి వేస్తాడు, తిరిగి యింటికి వచ్చిన వెంకటేశ్వరుడు ఏమీ ఎరగనట్లుంటే ఆ పోగుల్ని ముద్రికల్ని ఇవ్వ మంటుంది. దాంతో స్వామి ఖంగుతింటాడు. వారిద్దరి మధ్య రభస లేస్తుంది. స్థూలంగా ఇదీకథ.

''అర్జునుడేసింది ఆ ఒక్కవనమూ ఓబనం మొగిలేరి గొబ్బియాలో
దున్నకనే పండునే దుంపకురిమేలు ,,
నల్లకనే పండునే సన్నజాజుల్లు ,,
వట్టి యార్లసైరా పచ్చిదవనంబు ,,
వాసనా కొచ్చేనే వనముకోకిలలు ,,
వలవేసి పట్టేరు వన పాలకులే ,,
పట్టి పంజరావేసి పాలునెయ్యేసి ,,
మంగరా ఓ మంగా అలివేలిమంగా ,,
పంజరప్ప పిలకాను బాగుగా బెంచూ ,,
సామిరో సామి ఓ సామి నేడు ,,
మొగవారు హాడినా వేటలేగాదు ,,
ఆడవారాడిన వేటలే సామీ ,,
మంగరా ఓ మంగా అలివేలిమంగా ,,
ఏమి బాసలు నువ్వుకోరేవే మంగా ,,
నువుకోరినా భాసల్లు నీకిత్తుభామా ,,

సామిరోసామి ఓ సామి నేడు ,,
నేకోరివ్ని బాసాలు నాకేలసామీ ,,
నేకోరినన్ని బాసాలు నా కొదుసామీ ,,
నా సూరే చంద్రా రాజులు చూసినా పట్టే ,,
నీపట్టు పది ఏల్లతో కట్టినా బొట్టు ,,
నాబొట్టు సొచ్చిగాను వేబ్బాసలియ్యి ,,
గాలి దేవుని సొచ్చివేట లేయంగా ,,
గాలి దేవుడు నీకు సెత్తాలూడ్చేనూ ,,
అగ్గి దేవుని సొచ్చి పేట లేయంగా ,,
అగ్గి దేవుడు నీకు హస్త బందుగుడు ,,
వానదేవుని సొచ్చి హేటలేయంగా ,,
వానదేవుడు నీకు కళ్యాపు జల్లు ,,
మంగరా ఓ మంగా అలివేలి మంగా ,,
సూరే చంద్రా రాజులు సూసినా బొట్టే ,,
నా పది ఏల్లతో కట్టినా బొట్టే ,,
నా బొట్టు సొచ్చిగాను యేట లేయంగా ,,
తిరిగి నగికీ కొచ్చా ఆసామి నేడు ,,
పరుగు పరుగున వచ్చా అలివేలి మంగా ,,
ఎండి కాగలతోనా ఏన్నీల్లు బట్టా ,,
పగిడి కాగలలోనా పన్నీల్లు తొలిపా ,,
ఏన్నీల్లు పన్నీల్లు సరిదలమసేసీ ,,
సామిరో ఓ సామి నా సామి నేడు ,,
ప్రాణంబులయితేను ఆడవే సామి ,,
జాలారి బండెక్కి జలకంబులాడా ,,
గిలకల్ల సెమ్మెత్తి బుడుకున్న ముంచా ,,
నా బంగారు సెమ్మెత్తి పైన పెలక మాడా ,,

జలకాలాడీ సామి యివతలాకొచ్చా ఓబనం మొగిలేరి గొబ్బియాలో
బంగారు సేలవులు ధరియించి నాడా ,,
మంగరా ఓ మంగ అలిపేలి మంగా ,,
పంచ తిరమణి పెట్టె అందియ్యే మంగా ,,
పంచ తిరమణి పెట్టె హందిచ్చినాదీ ,,
ఎండి పుల్లలతోన తిరవణ్ణి ఏసీ ,,
కస్తూరి గంధాము నల్లు కున్నాడా ,,
పునుగూను జవ్వాది పూసుకు న్నాడే ,,
మంగానువై తేను మంగా అలిపేలు మంగా ,,
పన్నెండు కూరగాయలు పళ్లానా దెట్టా ,,
బంగార ముక్కాల్ల పీట పై సిందీ ,,
సామిరో సామి ఓ సామి నేడు ,,
హన్నములయితేను బ్రోంచెయ్యరా సామి ,,
బంగారు పీట మీద కొలువు దీరేను ,,
నేతితో బ్రోంచేసి నేతసెయి తెలిపా ,,
బోంచేసె అసామివత లొచ్చేను ,,
మంగారా మంగా ఓ మంగనేడు ,,
యేట మార్గాము నేను బోతానే మంగా ,,
ఎర్రి యేపులు (కుక్కలు) రెండు ఏంటేసుకోని ,,
బంగారు పావుకోల్లు పాదాన దొడిగా ,,
బంగారు పావు కోల్లు పాదాన దొడిగీ ,,
ఏడు కొండల సామి ఏటలే బోయా ,,
సామట్ల బొతానే మంగేమి సేశా ,,
కోమటీ ఈదులకు పరుగున్న బోయా ,,
కోమటీదక్కలారా మా యక్కలారా ,,
నేను గట్టేసీర మీకు యిచ్చేనూ ,,

మీసీరా రయికీలు నాకూయివ్వండి ఓబనం మొగిలేరి గొబ్బియాలో

మీరు బెట్టే సొమ్ము మాకియ్యరమ్మా ,,

ఈమె సీరాలు రయికీలు వాల్ల కిచ్చిందీ ,,

వాల సీరా రయికీలు వై తేను ,,

వాల్లు బెట్టేటీ సొమ్ములు మంగా ,,

వాల సీరలురయికలూ హందు కున్నిందీ ,,

పరుగు పరుగున వచ్చా ఆలివేలు మంగా ,,

ఎండి కాగలతోనా ఏన్నీల్లు బెట్టా ,,

పగిడి కాగల తోనా సన్నీల్లు దొలిపా ,,

వేన్నీల్లు సన్నీల్లు సరిదళము జేసీ ,,

సీకాయ ఊటలేసిగరబురుగూలూ ,,

మంగకాయ ఊటలే మాగన్నెనూనా ,,

ఎక్కరానటవలకు నిచ్చెన్ను వేసీ ,,

చిద్దెల్ల నూనెలే సిరిగిన్నె కొంచా ,,

సిరిగిన్నె నూనెలే తలలంటు కుండా ,,

జాలారి బండెక్కి జలకంబు లాడా ,,

వల్లార్చి ఆ మంగ వస్త్రాలు గట్టా ,,

ఎండి దువ్వాన్నతో ఎలసిక్కు దీసీ ,,

పైడి దువ్వాన్నతో పాపట్లు పొందీ ,,

పాపటీ సరసునా పచ్చలే దోపా ,,

పచ్చలా సరసునా ముత్యాలు దోపీ ,,

ముత్యాల సరసునా మానిక్యం బెట్టా ,,

మాణిక్యం సరసునా మల్లించే కురువా ,,

తీరేను ఆ కొప్పే తిరుపతీ కొండాల ,,

అమరేను ఆ కొప్పు అడ్డ కొండాల ,,

గూలారి కుంకమ్మ నొస్ట ధరియించా ,,

కస్తూరి కాటికా కండ్ల కేసిందీ   ఓబనం మొగిలేరి గొబ్బియాలో
పునుగు జవ్వాదీ పూసుకొన్నాదీ ,,
హత్తరు పన్నీరు సల్లుకున్నాదీ ,,
అందాని కద్దాల సీర కట్టిందీ ,,
విలువటద్దము లెత్తి నీడలే చూశా ,,
పరుగు పరుగున వచ్చా అలివేలి మంగా ,,
కుక్కల కూడేసి కుండ లెగగట్టా ,,
పిల్లలకు పాలు బోసి బీగాలు వేశా ,,
ఏడేడు దరవాదులు బీగాలు వేశా ,,
కట్టకడ దరవాది గడిమాను వేశా ,,
మల్లెపూలా గంప చేత బట్టిందీ ,,
అడవి మల్లె పూలు గంపలు గోసీ ,,
పోయొచ్చే దోవల్లో హంగుల్లు బెట్టా ,,
యేటలాడీసామి తోట కొచ్చేనే ,,
తోటలో ఆ సామి కండ్ల జూసేనూ ,,
యేపూరే ఓ భామా యేపూరే నీదీ ,,
యే వూరులయితేను నీకేల సామీ ,,
ఆడవారితోన మాటలేలా సామీ ,,
మా మంగ కట్టే సీర నీ కిత్తు భామా ,,
మా మంగ పెట్టే సొమ్ము నీ కిత్తు భామా ,,
నాతోన కొంచేపు మాటలాడావే ,,
నీతోటి మాటాలు నాకేల సామీ ,,
అప్పుడూ అవుతేనూ అలివేలి మంగా ,,
ఇట్లాటి బుద్దులు ఉండాయి గాదా ,,
అట్లా ఆ మంగ ఎలనాడ దమ్మా ,,
మా మంగ బెట్టే సొమ్ము నీ కిత్తు భామా ,,
నాతోవా కొంచేపు జూదమాడావే ,,

నీసెవల్లో పోగులూచేతి ముద్రీలూ ఓబనం మొగిలేరి గొబ్బియాం

నాకైనా విస్తేను మాటలాడేము ,,

చెవ్వల్లో పోగుల్లా చేతిముద్రీలే ,,

ఆ ఒక్క చిన దానికి తీసిచ్చినాడా ,,

ఆకునా కొంచేపు హాటలాడీరి ,,

పోకనా కొంచేపు పొద్దు బొయ్యారీ ,,

సున్నానా కొంచేపు జూజ మాడీరి ,,

యేటలాడే సామి నిద్దరుటు బోయా ,,

సోమీ శిరసునెత్తి తొడ మీద బెట్టీ ,,

అలసి నిద్దర బోయ ఆసామి నేడు ,,

శిరసుటు ఎత్తింది అలివేలు మంగా ,,

సోమికే తెలియక ధరమిందబెట్టా ,,

సోమికేతెలియక గంపెత్తినాదీ ,,

మల్లిపూలాగంప సంక బెట్టిందో ,,

ఆది బాటటు పట్టా హలివేలి మంగా ,,

పరుగు పరుగున వచ్చా నగరందు జొచ్చా ,,

గడిమానులప్పుడు మంగదీసిందీ ,,

ఏడేడుదర వాదుటు బీగాటు దీశా ,,

పరుగు పరుగున వచ్చి అలివేలి మంగా ,,

ఎండికాగలతోన ఎన్నీల్లు బెట్టా ,,

పగిరి కాగలతోన నన్నీల్లు దొలిపా ,,

ఆయినట్టు పోయినట్టు స్రానంబు చేశా ,,

కూడు కూరాలొండి కుడటప్ప దొంచా ,,

ఎండి కాగలతోనా ఏన్నీల్లు బెట్టా ,,

బంగారు సెమ్మలతో తీర్థాలు బెట్టీ ,,

యేట బోయిన సోమి నగరందు వచ్చా ,,

బంగారు సెమ్మలతో తీర్థాలు ఎత్తి ఓలనం మొగిలేరి గొబ్బియాలో
సోమి పాదములైన తాగడిగినాదో ,,
బంగారు కొంగుతో పాదాలువత్తి ,,
పాదమొత్తిన కొంగు కండ్లొత్తు కుండా ,,
ఎండి కాగలతోన ఏన్నీల్లు బెట్టా ,,
పగిడి కాగలతోన నన్నీల్లు దొలిపా ,,
సోమిరో ఓ సామి సామిరో నేడు ,,
ప్రాణంబు లయితేను సెయ్యటో సామి ,,
అయినట్టు పోయినట్లు ప్రాణంబుచేశా ,,
వల్లార్చి ఆ సామి వస్త్రాలు గట్టా ,,
బంగారు పల్లాన బువ్వండ్డించినాదే ,,
పన్నెండు కూరగాయలు పల్లాన బెట్టా ,,
బంగారు సెమ్ముతో తీర్థాలు బెట్టీ ,,
అన్నములవుతేను భోంచేయి సామీ ,,
బంగారు పీటలే సామికేసిందీ ,,
ముక్కల్ల పీట పైన సామి కొలువుదీరే ,,
నేతితో భోంచేసి నేతసెయి వెలిశా ,,
భోంచేసి ఆ సామి ఇవతలొచ్చేనూ ,,
మంగరో మంగ అలివేలి మంగా ,,
తమ్మ పడిగెలతో నానువ్ తరలిరావే ,,
తమ్మ పడిగెలతోనా తరలి వచ్చిందీ ,,
సున్నా పుగాయి యేసుట్టి యేమడుపు ,,
సున్నాపుగాయి యిచ్చి సుట్టిచ్చి మడుపు ,,
సామిరో ఓ సామి నా సామి నేడు ,,
నీసెవ్వుల్లో పోగుల్లు సేతి ముద్రీలు ,,
మంగరో ఓ మంగ అలివేలి మంగా ,,

సేనొచ్చే దోవల్లో భోగమూటల్లే   ఓబనం మొగిలేరి గొబ్బియ
బోగాము కన్నాకు ఇనాములిస్తే ,,
సామిరో ఓసామి నాసామి నేడు ,,
బొంకితివే ఓసామి బొంకితివే నేడు ,,
ఇట్లాంటి బొంకులూ నీకేల సామీ ,,
మంగరో ఓ మంగ అలివేలిమంగా ,,
ఆమాట హంటేనే హలివేలిమంగా ,,
సెవ్వల్లో పోగుల్లు యేలి ముద్రీలే ,,
సేతికి దీసింది ముందరా వేశా ,,
రట్టు చెయ్యాకే మంగ గుట్టుగా ఉండే ,,
ఇట్ల మాయన్న వింటేను కొట్ట బోవ్వునే ,,
ఇట్ల మాయన్న పింటేను తిట్టా బోవూనే ,,
రట్టు చెయ్యాకు మంగ గుట్టుగా ఉండూ ,,

పై పాటలో వెంకటేశ్వరుడు దక్షిణ నాయకుడిగాను మంగ ఇ నాయికగాను కనిపిస్తుంది.

## 3. చిన్న బూబును పెళ్ళాడిన వెంకటేశ్వరుడు :

వెంకటేశ్వరుడు డిల్లీ పచ్చాప్ కూతురైన నాతికన్నుల చిన్నబు దొంగతనంగా ఎత్తుకొచ్చి వివాహం చేసుకోవడం ప్రధానాంశం. ఇది భా లోని రుక్మిణీ కళ్యాణ ఘట్టాన్ని తలపింప చేస్తుంది, ఇది పూర్తిగా జా కల్పన, శ్రీనివాసుడికి శ్రీలక్ష్మి, అలివేలు మంగ (పద్మావతి) అనే భార్యలున్నట్లు కథలున్నాయి. కానీ ముస్లీముల పడచును పెళ్ళి చేసుక ఏ పురాణంలోను, ఏ శిష్ట సాహిత్యంలోను లేదు, ముస్లీముల ఆడప శ్రీనివాసునితో కలిపి హిందువులకు తురకల్ని మామల్ని చేశారు జాన జానపదుల హిందూ ముస్లీం ఐక్యతా భావానికి ఇదొక చక్కని నిద జానపదుల మతసహనానికిదొక మచ్చు తునక.

శ్రీలక్ష్మి పద్మావతులకు సరిపడక పద్మావతి దిగువ తిరుపతికి వచ్చేస్తే వెంకటేశ్వరుడు లక్ష్మితో సహా తిరుమల కొండపైన శిలగా మారిపోయాడనేది ప్రసిద్ధమైన అంశం. అయితే కొండపైన ఆ ఆలయంలోనే ఢిల్లీ నవాబు కూతుర్ని తెచ్చుకొని పెట్టుకున్నట్లు ఈ జానపద కథ చెబుతుంది.

''అలికి పూసీ నింటలోన మురుగయ మురుగా
కలికి కుచ్చుల కమ్మిడి బరిచా " "
కలికి కుచ్చులా కమ్మిడి బరిచి " "
దీనా పూరిదిండే పరిచా " "
సన్న జాజుల సరుపే బరిచా " "
పచ్చిదవనం పాన్పు బరిచా " "
నాలుగు పక్కల కానదీయెలే " "
పవ్వాలించె ఎంకటి రమణా " "
ఆదమరచి నిద్దరపోయా " "
సేటుమారి కలలుగనేనే " "
కలాగాని మేలుకొనెనే " "
తల్లివద్దకు వచ్చినాడే " "
అమ్మాయినవే కన్నతల్లీ " "
సేటుమారి కలలు గంటీ " "
ఎరిసి నేను సెబుదూ తల్లీ " "
ఎరవక నేసెబుదూ తల్లీ " "
ఎరుపేలా భయ్యామేలా " "
యిమారంగనాతో సెప్పు " "
ఢిల్లీ పచ్చావ్ కూతురంటే " "
నాతి కన్నుల చిన్నాబూబు " "
మనా కొండాకు తెచ్చినట్లే " "

పెండ్లివయిన సేసినట్లే   మురగయ   ముదుగా
దాని పక్కాన పండినట్లే   ,,   ,,
అడ్డా ముద్దూలాడినట్లే   ,,   ,,
కోగిరిలే కట్టిచ్చినట్లే   ,,   ,,
ఇటీమింటీ కలలు గంటీ   ,,   ,,
కొడకాయినరా ముద్దులకొడకా   ,,   ,,
తక్కువజాతి ఈనపు కొలము   ,,   ,,
పచ్చీ చేపలే తినేటివారే   ,,   ,,
తురకలాతో సవాస మొద్దూ   ,,   ,,
తల్లీయినవే చను గన్నతల్లి   ,,   ,,
నువ్ సెప్పీనాను పోతానమ్మా   ,,   ,,
నువ్ సెప్పతున్నా పోతానమ్మా   ,,   ,,
కొడుకాలునరా చిన్నా కొడుకా   ,,   ,,
మనా కొండాకు చేటు కలుగు   ,,   ,,
నీకు తగినది ఆలివేలు మంగా   ,,   ,,
తురకలతో సవాస మొద్దు   ,,   ,,
అమ్మాయినవే కన్నాతల్లి   ,,   ,,
ఎనక్కి తిరిగి వచ్చినాడే   ,,   ,,
దిగువా తిరుపతి జేరినాదే   ,,   ,,
అన్నాయినరా గోయిందరాజా   ,,   ,,
సేటుమారి కలలుగంటి   ,,   ,,
తమ్ముడ వినరా ఎంకటి రమణా   ,,   ,,
ఏమి కలలు గంటి వప్పా   ,,   ,,
ఢిల్లీ పచ్చావ్ కూతురంట   ,,   ,,
మనా కొండాకు తెచ్చినట్లే   ,,   ,,
దాని పక్కన పండినట్లే   ,,   ,,

| | | |
|---|---|---|
| కోగిరిలే కట్టించినట్టూ | మురగయ | మురుగ |
| మనా కొండన నిలిపినట్టే | ,, | ,, |
| తమ్ముడాయినరా ఎంకటి రమణా | ,, | ,, |
| తక్కువా జాతి ఈనపు కులమే | ,, | ,, |
| పచ్చీ చేపలు తినేటి వారే | ,, | ,, |
| గొడ్డూ మాంసము తినియేటి వారే | ,, | ,, |
| తురకలతో సవాసమొద్దు | ,, | ,, |
| తమ్ముడాయినరా ఎంకటరమణా | ,, | ,, |
| అన్నాయినరా గోవిందరాజా | ,, | ,, |
| నువ్ సెప్పినాను పోతానన్న | ,, | ,, |
| సెప్పకున్న పోతానన్న | ,, | ,, |
| అట్లానే ఎంకటి రమణా | ,, | ,, |
| తంగపార ఎత్తినాడే | ,, | ,, |
| వడ్డితట్ట ఎత్తినాడే | ,, | ,, |
| గడ్డపార భుజము నిల్పా | ,, | ,, |
| దారి పట్టే ఎంకటిర మణా | ,, | ,, |
| గడ్డపారవన్న దీశా | ,, | ,, |
| భుజము యందు నిలిపినాడే | ,, | ,, |
| అన్నముందు తమ్ముడు ఎనకా | ,, | ,, |
| ఢిల్లీ పచ్చావ్ కోట జేరే | ,, | ,, |
| ఏమండయ్యా నవాబులారా | ,, | ,, |
| పాత గోడలు పెట్టేటి వారే | ,, | ,, |
| పాత గోడలు మొక్కలే సేము | ,, | ,, |
| గోడలైన పెట్టేము | ,, | ,, |
| ఏమండప్ప నవాబులారా | ,, | ,, |
| కూలిపనీ చేసేమయ్యా | ,, | ,, |

ఏమండప్పా బోయిలారా మురగయ మురుగ
యేదేశ మేవ్వూరుమీది ,, ,,
మచ్చల బందారి మాది ,, ,,
మా వక్కవరునములేక ,, ,,
కూలి పనుల కొచ్చినాము ,, ,,
గోడలైన పెట్టేమయ్యా ,, ,,
జిల్లారీలో పూడు ఏత్తేము ,, ,,
ఢిల్లీ పచ్చావ్ అయితేనేమొ ,, ,,
వడ్డి బోయిల పిలిచినాడే ,, ,,
మొగిలి గోడ వప్పించినాడే ,, ,,
మొగిలి గోడ వప్పించినాడే ,, ,,
మొగిలి గోడ తప్పకోని ,, ,,
పగులంతా గోడ పెట్రీ ,, ,,
రెయ్యంత కూలదోశా ,, ,,
ఏమండప్ప బోయిలారా ,, ,,
పెట్టిన గోడ ఇరగదోసీ ,, ,,
వార మంత పనులు జేసి ,, ,,
కూలి ఎట్ల ఇస్తమయ్యా ,, ,,
ఇనావయ్యా నా బాబు నీవు ,, ,,
వానాగాలి రప్పించినాడే ,, ,,
గోడలెల్ల కూలదోశా ,, ,,
ఢిల్లీ పచ్చావ్ వచ్చినాడే ,, ,,
గోడతిట్టు చూసినాడే ,, ,,
ఏమండయ్యా వడ్డి బోయలు ,, ,,
పెట్టిన గోడలు కూలిసేరు ,, ,,
ఏమి సేతుము సామి మేము ,, ,,

| | | |
|---|---|---|
| వానగాలి సమ్మతించె | మురగయ | మురుగా |
| మేమేమి సేతుము సామి | ,, | ,, |
| పగులెల్ల గోడ పెట్టి | ,, | ,, |
| మట్టి బొమ్మలు తయారు జేసే | ,, | ,, |
| ఆడ బొమ్మను మగా బొమ్మను | ,, | ,, |
| మట్టితోనే తయారుచేసె | ,, | ,, |
| గోడ మీంద నిలిపినాదే | ,, | ,, |
| ఢిల్లీ పచ్చావ్ కూతరేమొ | ,, | ,, |
| బొమ్మలు జూడనక్కడి కొచ్చా | ,, | ,, |
| దాది కన్నెలు పిలుచుకోని | ,, | ,, |
| గోడ వద్ద నిలిపినాదే | ,, | ,, |
| బొమ్మలపైన చూసుతాదే | ,, | ,, |
| మాయకిష్ణ ఎంకటి రమణా | ,, | ,, |
| నాతికన్నెల చిన్న బాబును | ,, | ,, |
| కన్నులార సూసినాదే | ,, | ,, |
| సంక అమర బెట్టినాదే | ,, | ,, |
| తిరిగి జూడక పరుగులెత్తి | ,, | ,, |
| నబాబు దండె ఎనక వచ్చా | ,, | ,, |
| అడ్డ గొండ కొచ్చినాదే | ,, | ,, |
| అక్కడైన నిలిచినాదే | ,, | ,, |
| నబాబు దండే పడమట నిలిచా | ,, | ,, |
| ఎంకటి రమణా తూరుపు నిలిచా | ,, | ,, |
| వారి వారికే వాదులు కలిగే | ,, | ,, |
| ఎంకటి రమణ ఏమి బలికా | ,, | ,, |
| మురా (పంది) దారిని కోసినేను | ,, | ,, |
| ఇందులైన చేస్తాను | ,, | ,, |

మురా దాయను వండివేను ముర్ధగయ మురుగా
మీకునైన పెట్టుతాను ,, ,,
మురూ దారి పేరు ఎత్తగ ,, ,,
నబాబు గుంపు ఎనుకవాలె ,, ,,
కొండకేమొ దెచ్చినాడే ,, ,,
మూలకోగిరి (ఆలయం) లొంచినాదే ,, ,,
అలివేలు మంగ పోటికి ,, ,,
తరలి ఏమొ వచ్చినాడే ,, ,,
మంగ వద్దన నిలిచినాడే ,, ,,
పక్కన్న నవ్వినాదే ,, ,,
మంగయినవే అలివేలుమంగ ,, ,,
నీకు మించిన సవితిని తెచ్చినా ,, ,,
మూలకోగిరి లొంచినానే ,, ,,
సూతురావే అలివేలు మంగా ,, ,,
పట్టు మంచం పావుకోల్లె ,, ,,
దాది కన్నెలు ముగ్గురునైన ,, ,,
ముగ్గురైన దాది కన్నెలు ,, ,,
విద్దరూపును ఒక్క మనిషి ,, ,,
లాలిపాడను ఒక్క మనిషి ,, ,,
బంగారీ పైట లెత్తి ,, ,,
ముసుగు పెట్టే అలివేలిమంగా ,, ,,
వారు ముసుగు లేసినాదే ,, ,,
సిత్తానూర్ బాట పట్టె ,, ,,
సిత్తానూర్ సేరె మంగా ,, ,,
తల్లివర్ధన నిలిచినాది ,, ,,
గోడుగోడున దుఃఖించినాదే ,, ,,
అమ్మయినవే అలివేలిమంగా ,, ,,

| | | |
|---|---|---|
| ఏమి కష్ట మొచ్చెనమ్మ | మురుగయ | మురుగా |
| నాతోన ఇన్న వించు | ,, | ,, |
| అమ్మాయినవే కన్న తల్లి | ,, | ,, |
| ఢిల్లిపచ్చాప్ కూతురంట | ,, | ,, |
| నాతి కన్నుల చిన్న బూబు | ,, | ,, |
| మనా కొండాకు దెచ్చినాడే | ,, | ,, |
| కోగిరిన ఉంచినాడే | ,, | ,, |
| దాది కన్నెల బెట్టినాడే | ,, | ,, |
| అమ్మాయినవే కన్నతల్లి | ,, | ,, |
| నీకు మించిన సవతినైన | ,, | ,, |
| తెచ్చినానని చెప్పెనమ్మ | ,, | ,, |
| నేను వలిగి ఒస్తినమ్మ | ,, | ,, |

ఇలా వెంకటేశ్వరుడు జానపదగేయాలలో భక్త జనపాలకుడి గాను దక్షిణ నాయకుడైన శృంగార పురుషుడుగాను, హిందూ ముస్లిం మత సామరస్యానికి నిదర్శనంగా నిలచిన కలియుగ దైవంగాను చిత్రీకరించ బడ్డాడు.

## 3. గోవ్యాఘ్ర సంవాదం :

అడవిలో 'పూరి' మేయడానికి వెళ్ళిన 'బాపనోళ్ళ బొల్లావు' కు, దాన్ని చంపడానికి వచ్చిన ఒక పులికి మధ్య జరిగిన కథే గోవ్యాఘ్ర సంవాదం. ఇది అనంతామాత్యుని భోజ రాజీయంలోని గోవ్యాఘ్ర సంవాదానికి అనుకృతిగానే నడిచింది. ఇది కరుణ రసాత్మకమైన కమనీయ కల్పన. భోజరాజీయంలో ఈ గోవు ఒక విప్రవర్యుని 'హోమధేనువు' గా చెప్పబడింది.[14] ఇదే అంశాన్ని తెలిపే మరో గేయాన్ని రామరాజుగారు తన 'తెలుగు జానపద గేయ సాహిత్యం' లోను పేర్కొన్నారు. అందులో శ్రీకృష్ణుని గోవుగా పేర్కొనబడింది.[15]

బిరుదు రాజు రామరాజుగారన్నట్లు 'సత్య సంధత, ధర్మనిరతి, పశువుల నుండి మానవుడు నేర్చుకొనవలసినవిగానుద్బోధించు గేయమిది''.[16]

ఈ గోవ్యాఘ్ర సంవాదం రామలసీమ అంతట ప్రచారంలో ఉన్న ఒక గొబ్బిపాటలో బహు రమ్యంగా చిత్రీకరించబడింది.

గొబ్బీయాలో బాపనోల్ల బొల్లావు పైడిగంగావు
,, దానికొమ్ము కోటేలు చేసు బొల్లావు
,, దాని యీపు ఇరవైవేలు చేసు బొల్లావు
,, ఎక్కిపోయి ఎలికొండ ఎదురాకు మేసు
,, దిగొచ్చి తిప్పల్లో చిగురాకు మేసు
,, సాగిపోయి సంద్రాన సన్నీల్లు దాగు
,, మల్లొచ్చి మాయావు మందకడి బెట్టి
,, ఈదీ ఇస్త్రామాను వండొద్దు కొడుకా
,, కట్టె మోపని కాల్లదన్నేరు కొడకా
,, గొడ్రాలి ఇంటి కసువు పెరకొద్దు కొడుకా
,, ముండా గొడ్డాని రెండు గొట్టేరు
,, పుట్ట మీద పూరి మెయ్యొద్దు కొడకా
,, పుట్టలో నాగన్నా పాప కర్మోడు
,, ఎక్కిపోయి ఎలిగొండ ఎదురాకుమేశా
,, దిగొచ్చి తిప్పల్ల చిగురాకు మేశా
,, ఆపులిండే రేవుల్లో పూరి మేయబోయిందీ
,, గడగడ పులిరాజు గెవి ఎల్లొచ్చా
,, కుడి మీసమొడయేశా గుడ్లెర్రజేశా
,, ఏమయ్యా పులిరాజ అంత కోపములు
,, నిన్నారగించనూ నేను బోవాల

గొబ్బియాలో  నన్నారగించేది యేమానవాలు
,,  ఈగవాలకుండా ఈబ్బెట్టకుండా
,,  దోమవాలకుండా దోబ్బెట్టకుండా
,,  నన్నారగించోయి నీవు బోవోయి
,,  గొడ్డుండీ కంటీని గోవాకు కోడే
,,  తవుసుండీ కంటీ ధరమారాజును
,,  నా బిడ్డతో నొకమాట చెప్పొస్తానయ్యా
,,  అట్ట నీవు రాకపోతే ఏమానవాలు నాకు
,,  తూరుపు పుట్టేటి సూరీడు అన
,,  పగపూటి గూకేటి సెంద్రుడానా
,,  అంబో! అని ఆయావు దొడ్డి కాడి కొచ్చిందీ
,,  పాలు దాగుదువు రావే పట్టి కిష్టమ్మ
,,  నీ భాషాలు పిలుపూలూ నా కొద్దు తల్లీ
,,  నీకేముంద జెప్పేరా ఎర్రినా కొడకా
,,  ఆయావు బోయింది అడవులెంటా
,,  రావోయి పులిరాజా నన్నారగించూ
,,  ఆహా ఈ ఊరి కొండల్లో దూడలారగించితీ
,,  ఇంత సత్తెపు గోవు నేనేడకానా
,,  ఈ ఊరి కొండల్లో ఎద్దులారగిస్తీ
,,  ఇంత సత్తెపు గోవు నేనెరగ లేదూ
,,  ఈ ఊరి కొండల్లో ఆవులారగించితీ
,,  ఇంత సత్తెపుగోవు నేనెరగ లేదూ
,,  ఆవు కాళ్ల మింద పులిపాడి సచ్చా
,,  పులకాళ్ల మింద ఆవుపాడి సచ్చా''.

## ఉపసంహారం :

నిజానికి ఈ పుస్తకాన్ని 'పౌరాణిక జానపద గేయాల సంకలనం' అనక తప్పదు. అది నిజమే. కానీ ఇందులో వన్నీ పౌరాణిక సంబంధేతి వృత్తాలు, ఘట్టాలు చిత్రించిన పాటలయినప్పటికీ వాటిలో ఆయా పౌరాణికాంశాలు ఏవిధంగా విస్తరించ బడ్డాయన్న దృష్టికోణం నుంచీ పరిశీలించడం జరిగింది. ఈ క్రమంలో వరుసగా రామాయణ, భారత, భాగవత పురాణాలు ఈ గేయాలలో ఏలా గానం చేయబడ్డాయో పరిశీలించడం జరిగింది. ఆ తర్వాత ఇతర పురాణాలలో కావ్యాలలో వున్న హరిశ్చంద్రునికథ, వేంకటేశ్వరుని వృత్తాంతం గోవ్యాఘ్రసంవాదం వంటి ఇతర పౌరాణిక సంబంధమైన పాటల్ని కూడా పరిశీలించడం జరిగింది,

## సూ చి క లు

1. చూడుము. పూర్వగాథాలహరి. పుట - 527 - 528.
2. భారతం - సభాపర్వం - ప్ర. ఆ. 81 - 92
3. పాడినవారు. యస్. రామచంద్రయ్య, డోన్, కర్నూలుజిల్లా.
4. లోహితాస్యుడికి మరో పేరు రోహితుడు, మార్కండేయ పురాణంలో రోహితుడుగానే పేర్కొన బడ్డాడు,
5. పాడినవారు. కె. వెంకటరెడ్డి, పాణ్యం, కర్నూలుజిల్లా.
6. పద్మపురాణం - అధ్యా - 33
7. వివరాలకు చూడు. తిరుమలలో తిరునాళ్ళు సి. గోవిందరాజు. శ్రీనివాస ప్రచురణలు, రామసముద్రం 1985.
8. పాడినవారు. వెంకటమ్మ, చిన్నగొగులవాండ్లపల్లె, వాయల్పాడు (తా) చిత్తూరుజిల్లా.
9. చోద్యాలు > సోద్యాలు
10. బాధల సమూహం; యావలు = బాధలు
11. ఇది ఉదయం దినపత్రికలో 10—2—89న ముద్రితం సేకరణ కె. మునయ్య
12. పాడినవారు. ముద్దయ్య. భూతంవారిపల్లె, కలికిరిమండలం, చిత్తూరుజిల్లా
13. పాడినవారు. వీరనాగమ్మ, గుడిబండ, వాయల్పాడు (తా) చిత్తూరుజిల్లా.
14. భోజరాజీయం, అనంతామాత్యుడు 1435.
15. తెలుగు జానపద గేయ సాహిత్యం — పుట 171.
16. పైదానిలోనే పుట - 176.

# ఉపయుక్త గ్రంథసూచి


| | |
|---|---|
| ఆంధ్రమహాభారతము | నన్నయ. |
| భోజరాజీయము | అనంతామాత్యుడు. |
| రామాయణం | వాల్మీకి. |
| జానపద గేయ రామాయణం | గంగప్ప. యస్. |
| జానపద గేయ సాహిత్యవ్యాసావళి | రామరాజు బి. |
| తిరుమలలో తిరునాళ్ళు | గోవిందరాజు సి. |
| తెలుగు జానపద రామాయణములు | రామరాజు బి. తల్లంపల్లన్న గుప్తధర్మనిధి ఉపన్యాసములు శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయం తిరుపతి - 1987. |
| తెలుగు సాహిత్య సమీక్ష (మొదటి సంపుటము) | నాగయ్య జి. |
| తెలుగు సాహిత్యములో రామకథ | శమంతకమణి - పండా |
| పూర్వగాథాలహరి | శ్రీ. శ్రీనివాసరావు. వేమూరి. వెంకట్రామ అండ్ కో మద్రాసు - 1. |
| పురాణవాఙ్మయం | సుబ్రమణ్యం జి. వి. |
| బసవపురాణము - జైనపురాణ ప్రభావము సౌరభము | సుబ్రమణ్యం జి. వి. |
| మున్నీరు | గంగాధరం నేదునూరి |

| | |
|---|---|
| రాయలసీమలోని వేడుకపాటలు ఒక పరిశీలన | వెంకట్రామయ్య. రాపావి. పి హెచ్. డి. పట్టం కోసం శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత గ్రంధం. |
| నా రేడియో ప్రసంగాలు | లక్ష్మీకాంతం. పింగళి. |
| శ్రీపాండురంగం బృందావన సంకీర్తనలు | నారాయణదాసు ఎ. ఎన్. వి. గోపాల్ అండ్ కో. మదరాసు - 1. |
| స్త్రీలపాటలు | లక్ష్మీనారాయణ బుక్ డిపో రాజమండ్రి - 4 1986. |
| స్త్రీలపాటలు (అనంతపురం మండలం) | మోహన్. జి. యస్. |
| స్త్రీలరామాయణపు పాటలు | కృష్ణశ్రీ |

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 2 | 2 | అలౌకికములుమ | అలౌకికములను |
| 2 | 8 | పూర్వకధ | పూర్వకథ |
| 2 | 17 | ఒదికి | ఒదిగి |
| 4 | 5 | హరి విలాసం | హరి వంశం |
| 10 | 7 | రామవుకధకు | రామకథకు |
| 16 | 3 | సీత సమకర్త | సీత సమర్త |
| 19 | 9 | పాల కేతుల | పాలనేతుల |
| 24 | 19 | లాముడు | రాముడు |
| 26 | 4 | సీతాపహణ | సీతాపహరణ |
| 27 | 5 | పెద్దనా | పెద్దగా |
| 31 | 6 | పైటచెరరు | పైటచెరగు |
| 32 | 4 | కలిగించి | కరిగించి |
| 34 | 19 | రామమ్రగీవులకు | రామ సుగ్రీవులకు |
| 35 | 3 | చట్నంబు | పట్నంబు |
| 36 | 2,8 | కోరి తన | ఈ పదం లేదు |
| 36 | 13 | బీజ వాపం | బీజావాపం |
| 43 | 16 | ఆర్లు బార్ల | ఆరు బార్ల |
| 44 | 10 | చెచిపెట్టడం | చెరపట్టడం |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 55 | 16 | బాటలు | ఈ పదం లేదు |
| 56 | 23 | అలంతపురం | అనంతపురం |
| 60 | 12 | రాముడు | ఈ పదం లేదు |
| 65 | 19 | సముద్రంలో నుంచి | సముద్రంలో ముంచి |
| 72 | 24 | జానపదులవాడని | జానపదుల పదం లేదు |
| 74 | 5 | వాలి వడుసలు | వావి వరుసలు |
| 74 | 8 | కామ్యకవంలో | కామ్యకవనంలో |
| 75 | 6 | ననితరో | వనితరో |
| 76 | 17 | వేశ్యనాథురా | వేశ్యగాదురా |
| 80 | 10 | చదుష్క్రసాతాం | చదుష్క్రతాం |
| 80 | 15 | ఆదుకు | ఆదుకున్న |
| 97 | 15 | చిరగ | తిరగ |
| 99 | 3 | మాటలంటా | యాటలంటా |
| 104 | 13 | దాహమిక్కని | దాహమిమ్మని |
| 105 | 1 | కాశికుడు | కౌశికుడు |